మొదటి కూర్పు : 1932
రెండవ కూర్పు : 1937
*

## జయా ప్రసూనములు



జయాని కేతనమ్ : మదరాసు-7



Printed at The Liberty Press, Madras, p. 41 to 72—Q. H. M.S. 499
for Jaya Nikethan (Q.H. No. WG-52) Feb. '47

## 'జన్మభూమి'ని గుఱించి ప్రముఖులు - పత్రికలు :

ఈ చిన్ని నాటికను చదువుచుండగా ఉద్రేకము కలుగును గాని శుచిభావమును వీడము. ప్రతివిద్యార్థి కరకమలమునందును ఈ గ్రంథపు ప్రతి యొకటి యుంచదగినది. —గృహలక్ష్మి

... ... ...

A simple drama interspersed with poems embodying many noble sentiments on love of one's own native land, obedience to parents etc. 'Janma Bhumi' *contains an appeal both for young and old.—HINDU*

... ... ...

దేశాభిమానము, పెద్దలయెడ భక్తి, మిత్రులయెడ అనురాగము, దైవభక్తి మొదలగు సుగుణములు పాఠకులెల్లరి చిత్తములయందు నచ్చుపడునట్లు రచింపబడినది. బాలకులకుకూడ గ్రాహ్యమగు సులభశైలి. చిత్తరంజకములగు పద్యములు. —భారతి

... ... ...

"జన్మభూమి" వందనపూర్వకముగా నందికొని చదివితిని. భక్తిహ్రాసమగుచుండు నిక్కాలపు ఛాత్రుల కది యుపయుక్తమగు పొత్తమని మదీయాశయము. —శ్రీ శ్రీ శ్రీ రాజా విక్రమదేవవర్మ

... ... ...

'జన్మభూమి'లో రాఘవుని దేశభక్తి యొడలు పులకరింపజేయుచున్నది. అన్నపూర్ణమ్మ వినయాదులు భారతనారీమణుల గుణప్రదర్శనమునకు రత్నదర్పణములై యలరారుచున్నవి. గ్రంథము దొడ్డ జ్ఞానము గరపజాలినదై 'ఆత్మజ్యోతి' తరువాత జ్ఞానజ్యోతి యనుపించునట్టిదై ప్రకాశించుచున్నది. —శ్రీ మంగిపూడి వేంకటశర్మ

*

* *



* *

*

## పీఠిక :

ఈ "జన్మభూమి" అను చిన్ని నాటిక ఒక చిన్నకథను ఆధారముగా చేసికొని, స్వదేశ విదేశ మహాకవుల సద్భావములు కొన్నియు, కథానుకూలముగా వలయుచో మార్చిన పద్యరత్నములు కొన్నియు చేర్చి, శ్రీయుత ముద్దా విశ్వనాథముగారు వ్రాసినారు. ఈయన—స్వార్థత్యాగులును, దేశసేవాపరాయణులును, ఐందవహితసభాసభ్యులును, నా మిత్రులునగు - కీ॥ శే॥ సోమప్పశాస్త్రిగారి పుత్రరత్నము; గౌరాంగ చరిత్రాది గ్రంథములు రచించి, తెనుగునాట పేరుపొందిన మ. రా. రా. కూచి నరసింహము పంతులుగారి మేనల్లుడు; భారతి, గృహలక్ష్మి మొదలగు పత్రికలలో వ్యాసాదులు వ్రాయుచు తెనుగుతల్లిని కొలుచుచున్న భాషాభిమాని; మా కవితాసమితి సభ్యులలో ఒకరు.

కృతికర్తలు తమ గుణములును, తమకు రుచించు విషయములును తమ కృతులలో వెల్లడించుట సహజము. జన్మభూమి కృతికర్తయు అట్లే చేసె. కృతిపేరే ఈయనకు జన్మభూమియందు నెలకొన్న ప్రేమమును సూచించును. ఇదే కృతిలోని తొలి విషయమును అగుట దీనికి ప్రాపు. కథానాయకుని పేరు రాఘవరావు; ఇది సాభిప్రాయముగా వాడినదే. ఆ రాఘవునివలె ఈ రాఘవుడును పితృభక్తిపరాయణుడే; పెంచుటచే తల్లిదండ్రులుగా తాను భావించినవారియెడల భక్తి గాఢముగ చూపుట ఇందు మెఱుగు. కృతికర్త 'పుత్రమంతేచకర్మణి' అను ధర్మము ననుసరించి, ఉద్యోగము వదలివేసి, పితృభక్తి చూపుట బంధుమిత్రాదులు పెక్కురు ఎఱింగిన ముచ్చటయే. ఇక రాఘవరావునందలి తక్కిన సుగుణములును, శ్రీహరియందలి స్నేహభావమును, అన్నపూర్ణా వాసుదేవశాస్త్రులయందలి ఆదరణము, దైవభక్తి మున్నగు సుగుణములును కృతికర్తకు సహజములే అనుకొనదగు.

సుగుణఖనులగు పాత్రముల చర్యలకు తావలమై, సుగుణఖనియగు కృతికర్తదిద్దగా ముద్దులు మూటగట్టు ఈ పాత్తపు బిడ్డ తెనుగుచదువరుల మనస్సులు కరగించి, వారికి అల్లారుముద్దుఆయి హాయికూర్చి, పరాత్పరుని కరుణచే వన్నెకెక్కుగాక !

౧౦-౩-౧౯౩౧,
ఎలమంచిలి,
విశాఖపట్టనము జిల్లా.

మారేపల్లి రామచంద్రశాస్త్రి.

ప్రవేశిక :

నా 'జన్మభూమి' తొలుత 'సమదర్శిని' ప్రమోద సంవత్సర ఉగాది సంచికలోఁ బ్రకటింపఁబడెను. దీని మాతృక 'జువెనిల్ బడ్జెట్టు' లోని హృదయంగమమగు నొక చిన్న కథ. నైసర్గికములగు స్వదేశ స్వస్థలాభిమానాదుల గుఱించి మానవకోటి కంతకును అభిప్రాయము లొకేతీరుగ నుండుననుట కీ చిన్నికథయె తార్కాణము.

మన దేశాచార సంప్రదాయముల కనుకూలముగ గాథ మార్పు చేయుటయే కాక, ఇందులకుపకరించు భావములు ఆంగ్లేయ కవిరత్నములగు ఎలిజాకూక్, సర్ విల్లియం షేక్స్పియర్, సర్ వాల్టర్ స్కాట్ మహాశయులు రచియించిన అమూల్య పద్యకావ్యములనుండి గ్రహించి ప్రసంగములలోఁ జేర్చితిని. పాఠకులకు రుచి గల్గించుటకై భారత, భాగవతాది సుప్రసిద్ధ పురాణగ్రంథముల నుండి కథాసందర్భమునకు సరిపడు పద్యములు కొన్ని, వలయు మార్పులతోఁ బాత్రము లచే ననువదింపఁ జేసితిని.

ఇదిగాక, ఆధునిక విఖ్యాత కవిపుంగవులగు శ్రీ మంగిపూడి వేంకట శర్మగారు, శ్రీ వడ్డాది సుబ్బారాయఁడుగారు, శ్రీకూచి నరసింహాము పంతులుగారు మున్నగువారల పద్యరత్నములును ఇందు గ్రహింపఁబడినవి. వీరలకు నా సవినయ నమస్కృతులర్పించుచున్నాను.

ప్రేమతో దీనికి 'పీఠిక' వ్రాసి దయచేయించిన నా హితైషులగు బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి కవి గారికి కృతజ్ఞతాపూర్వ వందనము లొనరించుచున్నాను. కాని నాయందలి అపార వాత్సల్యాతిశయముచే శ్రీ శాస్త్రిగారు చేసిన ప్రశంసకు మాత్రము నేనర్హుఁడను గానని మనవి.

—ము. వి.

*
* *

## ఈ నాటికలో

రాఘవరావు :— కథా నాయకుఁడు.

శ్రీహరి :— అతని బాల్య మిత్రుఁడు.

వాసుదేవ శాస్త్రి<br>అన్నపూర్ణాదేవి } వృద్ధదంపతులు.

మహాలక్ష్మి :— బాటను బోవు బాలిక.

*

# జన్మభూమి

రంగము:

చెట్లమఱుఁగున శిథిలమైయున్న 'రామగిరి' గ్రామము.
(ప్రవేశము: రాఘవరావు, శ్రీహరి.)

రాఘవరావు :—

చరణంబు లెచ్చోటఁ జరియించుచున్న
హృదయ మించుకయేని నెడలింపలేని
యైంద్రజాలిక బంధ మది యేదో యొకటి
మన 'జన్మభూమి' కి మనకును గలదు.
సృష్టి నది నిరక్ష రేఖయం దున్న
ధ్రువ మండలంబు నందున నొప్పుచున్న
మనసు నాకర్షించి మగ్నమ్ముఁ జేయు
నట్టి యయస్కాంత మందులోఁ గలదు.
అది స్వతంత్రునిచేత ననవరతంబుఁ
బ్రేమింపఁబడుచుండు హృదయంబు నందు,
బహు కష్టజీవియై బ్రతుకుచు నుండు
బానిసచే నల్లై భావింపఁ బడును.

మఱియు——

హాయి గూర్చెడు సీమ లవి యెన్ని గనిన
నవరత్నమయ సదనములెన్ని గనిన
తప్తకాంచన నికేతనములు గనిన
నాయాత్మ యందు దానంద మామూడ్కి,
ఇంద్రభోగ మనుభవించుచునున్న
హర్షవారిధి నోలలాడుచునున్న
నాయంతరంగంబునను 'జన్మభూమి'
స్మరణంబు పోనాడఁ జాలితినొక్కొ!
నా మాతృదేశమా! నాప్రాణపదమ!
నా నాకలోకమా! నాతపఃఫలమ!
నినుగారవింతును నిన్నె పూజింతు!
నిను మది భావింతు నిన్నె సేవింతు,
వెలలేని సద్వస్తు వితతులకన్న
వసుధ మదీయ సర్వస్వంబుకన్న
నాప్రాణమునకన్న నామేనికన్న
నతిగాఢముగ నిన్ను నాత్మఁబ్రేమింతు:
చెలఁగి నేను విదేశసీమలయందు
బహు సుందరోద్యాన వనములయందుఁ
దీర్ఘైన కాసార తీరమ్ములందు
స్వర్ణనిర్మిత దివ్యసౌధమ్ములందు

చెలువు రాణించు పచ్చికపట్టులందు
విహరించుచున్నను, వేగ వేగమున
నా 'జన్మభూమి'కి నన్నుఁ గొంపోవు
వాయువునకు నేను స్వాగతం బిడుదు!

ఈ స్థలమే, ఇదియే. నా కత్యంత ప్రియతమమగు నెల విదియే. అల్లదే, నేను మిత్రులతో 'కోఁతి కొమ్మచ్చి' యాడెడు వయసుఁ గడపిన వటవృక్షము. ఈశాన దిక్కున కాలువను చేరి కనఁబడుచున్న ఆ యిసుకతిన్నె మీఁదనే మేము 'చిడుగు' డాడెడువారలము. ఇదిగో, కుడివైపున — ఈ యీఁతచెట్టునుండియే పాపము! ఎంతయో కష్టపడి శృంగారముగ నల్లుకొనిన బంగారు పిచ్చికగూఁటిని వినోదార్థము పెకలించితిమి. ఆ ఘోర కృత్యము మఱచిపోవలెనన్నను నాకు మఱపునకు రాదు, కన్నులకు గట్టినటులున్నది.— ఆ 'జంప' కాలువలో పిల్లలందఱమును పడవ త్రోయునపు డది తిరుగఁబడఁగా దరినున్న బెస్తలు మమ్ముల నొక్కొక్క రిని పిలుకలుపట్టి యొడ్డున కీడ్చి కాపాడిరి! అబ్బా! ఆ దృశ్యము తలఁపునకు వచ్చిన నిప్పటికిని ఒడలు జల్లుమనును!

సుఖదుఃఖ మిశ్రితమగు హృదయాంతర్గత భావపరంపర తెఱుము కొని వచ్చుచున్నదే! ఇట్టె యానందము! అట్టె

సంతాపము! అవునవును. బాహ్య ప్రపంచవిషయము లెల్ల నొక యెత్తుగను, స్వస్థలాభిమాన మొక యెత్తు గను తోఁపించి, మనసు ద్రవింపఁజేయు మహత్తర విశేషమెద్దియో 'జన్మభూమి' యందున్నది!

శ్రీహరి:—మిత్రమా! ఈ ప్రదేశముతో నీకు సంబంధమున కవసరము కనఁబడదే? మీకుటుంబము వారెవ్వరును లేరే? నీవును చిరకాలముక్రిందటనే ఈయూరువదలితివే? బంధుమిత్రాదులు గూడ నున్నట్లు నాకు తోఁచుటలేదు. ఎందుల కింత యభిమానము?

రాఘవరావు:—నిశ్చయమే, శ్రీహరీ! నావాఁడొక్కఁడును లేఁడు. నాతండ్రి పోయినతోడనే మిగిలియున్న యాస్తి పంచుకొని, నా యన్నలు సౌఖ్యప్రదములగు వేర్వేఱు నెలవులు చూచుకొని, నన్ను విడిచిపోయిరి.

శ్రీహరి:—మఱి, నీజీవన మెటులు గడపితివి?

రాఘవరావు:—పాపము! వారికి సంతతి నిలువకుంటచే నాపైనే పంచప్రాణములును. దిక్కులేని నన్నుఁ జేరఁదీసి, సొంతబిడ్డలకంటె నల్లారు ముద్దుగఁబెంచిరి. మా యింటి పొరుగున నున్న ఆ వాసుదేవశాస్త్రియు, ఆయన సతీమణి అన్నపూర్ణాదేవియు సుజ్ఞానులు. బీద స్థితిలోనివారు. పౌరోహిత్యమువల్లనే కాలక్షేపము. స్వల్పమగు ఆదాయముతో నామె శ్రమపడి గుట్టుగ

సంసార మెట్లీడుచుండెనో ఆపెకే తెలియవలె, ఆ బ్రహ్మకే తెలియవలె. 'పతివ్రత' యనిన నిశ్చయముగ నామెకే చెల్లును.—

ఆడదు భర్తమాట కెదు
రాడదు, వచ్చినవారి వీడఁగా
నాడదు, పెక్కుభాష లెడ
నాడదు, వాకిలి వెళ్లి కల్లమా
టాడదు, మిన్నకేని సుగు
ణావలి కిందిరగాక సాటి యే
చేడియలేదు ధారుణిని
శ్రీకరనాముడు నన్ను పూర్ణకున్.

నా రుపవసించియైన నా సౌఖ్యముఁ జూచుచుండిరి. నా కయిదవయేఁడు రావెంటనే కాకినాడలోని 'అనాథశరణాలయము'లోఁ జేర్పించి, విద్య చెప్పించిరి. దైవకృపచే నేను 'మెట్రిక్యులేషన్' పరీక్షయం దుత్తీర్ణుఁడనై, నా క్షేమాభిలాషులకు సంతస మొనఁగూర్చితిని.

ఇంతలో 'ఐరోపామహాసంగ్రామము' తటస్థించినది. యుద్ధములో పాల్గొని దేశసేవ చేసి, రాజభక్తిఁ జూపవలెనను గాఢమగు నుద్దేశము నాకుఁ గలిగినది. అంతట తలిదండ్రులను స్వగ్రామమున దిగఁబెట్టి, నాయుద్యమ నిర్వాహణమునకై పిట్టకయిన తెలియకుండఁగ బయలు వెడలితిని.

శ్రీహరి :—సరి, సరి, అటుపై సంగతి యేమి ?

రాఘవరావు :—యుద్ధములో నా ధైర్య కౌశల్యములకు మెచ్చి నన్ను 'బి–1' రెజిమెంటునకు 'సుబేదార్ మేజరు' గ నియమించిరి. పెక్కు ఘనకార్యము లొనర్చి, ప్రభుత్వమువారి ప్రత్యేకప్రశంసకుఁ బాత్రుఁడ నైతిని. ఊరు విడిచి నేఁటికి పదునైదు వత్సరముల పైమాట. నా హితైషుల నెప్పుడు – ఎప్పుడు– దర్శించి ధన్యుఁడనగుదునా యని యువ్విళ్లూరుచున్నాను.

శ్రీహరి :—మిత్రరత్నమా ! నీమాటలు ఆలకించిన కొలఁదియు నొడలు జలదరించుచున్నది. 'ఇది నా యూరు, నా జన్మస్థలము' అని మనసార తలపోసి, ఉల్లముప్పొంగునట్లు హర్షింపనట్టి హతాత్ముఁడెవ్వఁడైన నుండునా ! అందును విదేశసీమలందు చిరకాలము సంచరించి. గృహోన్ముఖుఁడగుచు నేతెంచు సమయమున హృదయము తహతహపడకుండునా !—

పుట్టునె భూమియందొక య
పూజ్యుఁడు నాకిది మాతృభాష ; నేఁ
బుట్టిన దేశమిద్ది యని
పొంగక ప్రాణముఁ గల్గు పీనుఁగై ;

పుట్టవె తల్లి కడుపునను
　　బుర్వులవెన్నియో వానిలోన, నీ
కట్టిఁడి యెంచ నొక్కఁడగుఁ
　　గాక నరుండని యెంచ దోషమా.

ఆ పుణ్య దంపతులు జీవించియుండినచో నదృష్టవంతుడవే, రాఘవా !

రాఘవరావు:—నేను ఓడ దిగిననాఁడే మన సీతాపతి కనఁబడి, వారుభయులును క్షేమముగ నున్నట్టును, కాని ఆరోగ్యాది స్థితిగతులలో కుదికిలఁబడి యున్నట్టును చెప్పినాఁడు.

శ్రీహరి:—వారి యునికి ?

రాఘవరావు:—ఇదిగో, ఈ సందు తిరుగుడులోనే. కాని, యేఁమిది? ఇల్లు కనఁబడ దే! శిథిలమైన మొండి గోడలు మాత్ర మానవా లున్నవి. ఇక్కడనే యని నాకు చాల జ్ఞాపకము సుమా! కారణాంతరములచే నిల్లు పడిపోయి యుండవలెను! అయినను స్థలముమాత్ర మిదియే యని నా దృఢనిశ్చయము. అయ్యో! పూజ్యులారా! మీగతి యేఁమయినదో కదా! ఈశ్వరా !—

పాపాత్ముండను; బాపసంభవుఁడ; నేఁ
　　బాపంబులే సల్పుదున్ ;

బాపిన్ ; బావన ! పావనాత్మ ! నను ని
ష్పాపుం బొనర్పంగ దే ?
నీ పాదంబులె దిక్కుగాని యిఁకఁ దం
డ్రీ ! నాకు దిక్కేమి లే ;
దాసద్బాంధవ ! కావుకావు నను ! దే
వా ! భక్తచింతామణీ !

శ్రీహరి :—రాఘవా ! ఇంతమాత్రమునకే నిస్పృహతఁ జెందనేల ? కొంచెము దూరముపోయి ఎవరినైన కనుగొందము. 'నోటిలో నాలుక యున్నచో దేశములు జయింపవచ్చును' రమ్ము.

—అదిగో ! ఆవచ్చుచున్న బాలికనడిగి తెలిసికొందము.

రాఘవరావు :—[మహాలక్ష్మియను బాలిక ప్రవేశము.]

చూడు అమ్మాయీ ! ఇక్కడ వాసుదేవశాస్త్రిగారను బ్రాహ్మణులుండెడివారు, నీకుఁ దెలియునా ?

మహాలక్ష్మి :—ఏమి ? వాసుదేవుఁడుగారా ? ఆ, తెలియును. అన్నపూర్ణమ్మగారిని గూడ నెఱుఁగుదును, చల్లని తల్లి. ప్రతి శనివారమునాఁడును పర్వదినములందును భజనచేసి, మాకందఱకును ప్రసాదము లిత్తురే, వారు !

రాఘవరావు :—మిత్రమా ! ఏమి, ఆవృద్ధదంపతుల నిరంతర భక్తి ! ఎంతటి నిష్కళంక మనస్కులు !

సిరిదూరంబయిపోవనీ ! సుఖము ని
శ్శేషంబుగా జాఱనీ !
పరిహాసంబులు నీచడంబులు జను
ల్వ్యాపింపనీ ! రక్తముల్
దొరగన్నైబడి మోఁదనీ ! యురువిప
త్తుల్గ్రమ్మి బాధింపనీ !
హరిదాసుల్భవదంఘ్రిపద్మములఁ బా
యన్నేరుగా ! ఈశ్వరా !

ఇందాశ్చర్యమేమున్నది !—

పూనిభవత్పదాంబురుహమూల ని
వాసులమైన మేము మే
ధాసిధి నీవిలోకనముఁ దక్కఁగ
నన్యముఁ గోరనేర్తుమే
మానిత పారిజాత కుసుమస్ఫుట
సవ్యమరంద గంధ శో
భాసముశాలియైన మధుసంబు భజించునె
యస్యపుష్పముల్.

రాఘవరావు :—(మహాలక్ష్మితో) అమ్మా ! వారిబస ఎక్కడ?

మహాలక్ష్మి :—ఆ కాలువయొడ్డుననే పోయినచో చిన్నవంతెన యగపడును. దానికి తిన్నగ నున్న సందులోని కడ యిల్లే.

రాఘవరావు :—కొంతకాల మిక్కడుండిరి కదా వారు?

మహాలక్ష్మి :—అవును. మొన్నటి వఱదకు ఇండ్లన్నియు నేల మట్ట మయినవి. అప్పుడు చాల మందికి 'గాంధి నగరము'లో స్థలముల నిచ్చి ప్రభుత్వమువారు కాపా డిరి. ఆప్రదేశము మెరక యగుటచే శాస్త్రిలుగారు కూడ నచ్చటనే చిన్న కుటీరము వేసికొని నివసించు చున్నారు.

రాఘవరావు :—కొంచెము మాతో వచ్చి యిల్లు చూపు మమ్మా!

మహాలక్ష్మి :—సరే, రండి, (వెళ్లుదురు.)

(కొంత దవ్వరిగి)

మహాలక్ష్మి :—అల్లదిగో, ఇటికగోడ యున్న దొడ్డి ప్రక్క రెల్లు నేసిన చిన్న పాక............కనఁబడినదా? వసారాలో అన్నపూర్ణమ్మగారు రాట్నము త్రిప్పు చున్నారు. దండములండి బాబయ్యా!

(వెళ్ళిపోవును).

---

## రంగము.

## కుటీర సమీపము:

---

రాఘవరావు :—శ్రీహరీ! గుండె దడదడ కొట్టుకొను చున్నదే! ఆ కూర్చున్నది నా తల్లియేనా? అన్నపూర్ణాదేవియే! ఆ, అవును. ఆమెయే. ఎంత వృద్ధురాలై పోయినది! అయ్యో! ఎటులు శుష్కించి పోయినది! పోలిక పట్టుటగూడ కష్టముగ నున్నదే!

శ్రీహరి :—మిత్రమా! ఏఁబది వర్షము లెడ తెలిపిలేని కడగండ్లెన్నియో పడిన ప్రాణి, యిట్లు మాఱుటాక వింతయా?

[కుటీర ద్వారము.]

రాఘవరావు :—అమ్మా! నమస్కారము. మాకు కొంచెము దాహమున కిచ్చి పుణ్యము గట్టుకొనఁగలవా? ప్రయాణపు బడలికచే మిక్కిలి డస్సియున్నాము.

అన్నపూర్ణాదేవి :—బిడ్డలారా! చల్లనిమంచితీర్థము మాత్ర మియ్యఁగలను.

శ్రీహరి :—అదే పదివేలు, మాతల్లీ!



‡

అన్నపూర్ణాదేవి :— అయ్యో! నాయనలారా! నెత్తి మాఁడు చున్నది, ఎండలో నిలిచెద రేల? అరుఁగులు చాలఁ జిన్నవి. అయినను ఇదిగో, యీచదరమీఁద సరదు కొని కూర్చుండుఁడు. మీరు విశ్రాంతిఁ గైకొను లోపల నీళ్లు తీసికొని వచ్చెదను. (ఆమె వెళ్లును.)

రాఘవరావు :—ఎప్పటి 'సదయహృదయ'యే కదా! శ్రీహరీ! రమ్ము, అరుఁగుపైఁ గూర్చుందము.

---

రంగము.

(కుటీరములో నొక ప్రదేశము : ఒకముసలి బ్రాహ్మణుఁడు.)

---

శ్రీహరి :—దాహము మిక్కుటముగ నున్నందున అవ్వగారికి శ్రమ యియ్యక తప్పినదికాదు తాతగారూ!

వాసుదేవశాస్త్రి :—కూర్చుండు, నాయనా! కూర్చుండు. నేను లేచి యీతివాసి యిత్తమన్న లేవలేను; దృష్టి కూడ ఆనదురా, తండ్రీ!

రాఘవరావు :—మిత్రమా! ఎట్టి దుర్భరస్థితి!

వాసుదేవశాస్త్రి :—ఏమి చేయుదును బాబూ! వార్ధకము దప్పించుకొన, నరమాత్రు లశక్తులుగద!

కనులుగనరావు, వీనులు వినఁగరావు,
పండ్లుపోవునో పెదపెద్ద గండ్లుపడునో,

యతిశయించు నింద్రియవాంఛ, లడఁగు శక్తి,
నమ్ము! భూలోక నరకంబు సుమ్మి! ముదిమి.

శ్రీహరి :—తాతగారూ! 'తెక్కాడినఁగాని డొక్కాడ'ని స్థితిలోనుండిరి కాంబోలును, పాపము!

వాసుదేవశాస్త్రి :—నాయనా! జవసత్త్వము లుండినన్నినాళ్లు ఒడలు దాఁచుకొనక పాటుపడితిని. ఇపుడు బయటికి పోయి ఆర్జింప నశక్తుఁడను. వారి ధర్మమా యని తమ వేదపాఠశాలలోఁ బదివత్సరములు పని చేయుటచే, ప్రభువులు మా పోషణముకై నెలకు మూఁడు రూపాయలు 'పించను' ఇచ్చుచున్నారు. నా సతి నూలు చక్కఁగ వడుకును. నెలకొకసారి తయారైన నూలంతయు 'సబర్మతి ఆశ్రమము' న కంపుచుందుము. దీనివలన సగటున రోజునకు ముక్కాని మాత్రము కిట్టుచున్నది. ఏదో, వేడినీళ్లకు చన్నీళ్లు తోడు! అయినను, కఱవు దినములలో ఈ కొలఁది యాదాయ మేమూల, బాబూ?

(నిట్టూర్పుతో) రామయ్యతండ్రీ! సీతమ్మ తల్లీ!—

ఆటలు మాకు బాల్యమున,
యౌవనమం దెలనాగతోడ స
య్యాటలు, వానివెన్కను ని
రంతర సంసరణ ప్రయాసముల్,

గాటపుఁజింతలామయ వి
కారము లంతమునందున జ్జగ
న్నాటక సూత్రధార! రఘు
నందన! నీకిది చిద్విలాసమా!

శ్రీహరి:—'ధనమూల మిదం జగత్త'ని పూర్వు లెంత యనుభవముపై చెప్పినారు! డబ్బులేనివాని బ్రతు కెంత హేయము!—

బువ్వ లేనట్టివారికి బుద్ధు లెన్ని
చెప్పఁబట్టునె పెడచెవిఁ జేరుగాక
"భుక్తి గుదురక కుదురదు ముక్తి"యనెడు
మాట దలపోయఁగా వట్టి బూటకంబె?

మీవంటి సత్పురుషుల నిట్టి తీవ్ర పరిశోధనమునకు గురిచేసి 'దారిద్ర్య దేవత' కప్పగించిన సృష్టికర్తకు 'ఆప ద్బాంధవ' బిరుద మెట్లు సార్థకమగునో యూహింపఁ జాలకున్నాను.

వాసుదేవశాస్త్రి:—అయ్యా! కాల ప్రవాహమున కెదురీఁద నేరి శక్యము?—

వాయువశంబులై యెగసి
వారిధరంబులు మింటఁ గూడుచుం
బాయుచునుండు కైవడిఁ బ్ర
పంచము సర్వముఁ గాలతంత్రమై

పాయుచుఁ గూడుచుండు నొక
భంగిఁ జరింపదు కాల మన్నియుం
జేయుచునుండుఁ గాలము వి
చిత్రము దుస్తర మెట్టివారికేన్.

శ్రీహరి:—చక్కని హితబోధము చేసితిరి తాతగారూ! కాని, నా కొక యూహ స్ఫురించుచున్నది. మనసు విడిచి మాటాడిన మన్నింపుఁడు: మానవజీవితములో పోటుపాటులు రాకతప్పదు. పొంగి పొరలు ఉచ్ఛదశ లోనే యావచ్ఛక్తియు వినియోగించి మేలుకొంటి మేని భవ్యపథమునఁ జేరుదుము; అనఁగా కీళ్ళాడు దినములలోనే నాలుగు రూకలు జాగ్రత్త పెట్టుకొన వలెను. లేనిచో జీవయాత్ర అయోమయమయి దారిద్ర్య పీడితులమై ఎన్నో యిక్కట్టులు పొందవలసి వచ్చును.

వాసుదేవశాస్త్రి:—ఓయీ! వెఱ్ఱివాఁడా! యువకునకుండు సహజ సాహసముతో నీవు స్వశక్తి నాధారము చేసి కొని ప్రసంగించు చున్నావు; ఇంకను అనుభవము తక్కువ, నాయనా!—

'కలనాటి ధనము లక్కఱ
గలనాఁటికి దాఁపఁ గమలగర్భుని వశమా,

నెలనడిమినాఁటి వెన్నెల
యలవడునే గాదెఁబోయ నమవస నిసికిన్ '

అనిచెప్పిన కవీశ్వరుని అమూల్యవాక్యరత్నములు నీవు పఠించి యుండ లేదా ?

(అన్నపూర్ణాదేవి మంచితీర్థము దెచ్చి)

అయ్యా ! ఈ పాత్రలు తీసికొని దాహము పుచ్చుకొనుఁడు. పాపము ! ఎంతదవ్వునుండి వచ్చితిరో ! చెప్పనె రాలేక పోయితిని; పెద్దదానను, నాయనా !

(దప్పికఁ దీర్చు కొందురు.)

అన్నపూర్ణాదేవి :—మా యవస్థ యేమని చెప్పుకొందుము, బిడ్డలారా !—

కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమయోగి గణముల పాలం
గలఁడందు రన్నిదిశలను
గలఁడు కలండనెడువాఁడు గలఁడో లేఁడో !

సంతతినెల్ల దిగమ్రింగి, దిక్కు లేక యిటులు జీవచ్ఛవములమై యున్నారము.

రాఘవరావు :—దగ్గఱబంధువులు గాని, స్నేహితులుగాని యెవ్వరును లేరా అమ్మా ! మిమ్మాదరించుటకు ?

అన్నపూర్ణాదేవి :—లేరు నాయనా ! కన్నబిడ్డలు బ్రతుక కున్నఁ బోయిరి; మా పొరుగున తలిదండ్రులఁ

గోల్పోయి నిస్సహాయుఁడైన ముద్దుబాలునిఁ దెచ్చి గారాబముతోఁ బెంచి మా సర్వస్వ మతఁడే యని నమ్మితిమి. వాఁడయినఁ దక్కకపోయెనే యని అహోరాత్రములు విలపించు చున్నాము.

రాఘవరావు :—అతని పేరేమమ్మా ?

అన్నపూర్ణాదేవి :—(కన్నీటితో) పేరెందులకు నాయనా! అతనితోనే పోయినది పేరు. మంచి రూపసి. వినయ వివేక సంపన్నుఁడు. సీమమిరెపకాయవంటి చురుకుఁదనము. ధైర్య సాహసము లాతని సొమ్ము. సుగుణ ఖని. పరీక్షలో జయ మొందెనని యెంతయో ఆనంద పడితిమి. ఏమి సార్థకము ? కడ కంతయు 'బూడిదలోఁ బోసిన పన్నీ'రైనది. వార్ధకములో పోషించు నని నమ్ముకొనియున్న మమ్ముల నిరాశులఁ జేసి యీస్థితికిఁ దెచ్చినాఁడు.

వాసుదేవశాస్త్రి :—ఇంతకును మనకర్మఫల మిటులుండ ఆచిన్నిబాలుని నిందించు టేల ?

కర్మములు మేలునిచ్చును
గర్మంబులు గీడునిచ్చుఁ గర్తలు సుమ్మీ
కర్మములె బ్రహ్మకైనను
గర్మగుఁడై సరులఁ దడవఁగా నేమిటికిన్.

రాఘవరావు :—తల్లీ ! అతఁడేమి చేసిపోయినాఁడు ?

అన్నపూర్ణాదేవి :—చేయుట కేమున్నది, బిడ్డా? యుద్ధము లోనికి పోయెనని చూచినవారు చెప్పఁగా, మాకు గుండెలు బ్రద్దలైనవి. అప్పటి నుండియు నతని సంగతి తెలియనే లేదు.

వాసుదేవశాస్త్రి :—తప్పక రణరంగమున హతుఁడైనాఁడు. మనలనే తలిదండ్రులుగ భావించు నాబిడ్డఁడు జీవించియే యున్నచో, మన క్షేమ మారయ కుండునా? ఇంతకాల ముపేక్ష సేయఁడు. అయినను ఈ దీర్ఘ చింత యేల?—

ఈశ్వరుండు విష్ణుఁ డెవ్వోళ నెవ్వని
కేమి సేయుఁ బురుషుఁ డేమి యెఱుఁగు,
నతని మాయలకు మహాత్ములు విద్వాంసు
లడఁగి మెలఁగుచుందు రంధులగుచు.

అట్టియెడ, నీవిశాల ప్రపంచమున మనమొక లెక్కయా?

అన్నపూర్ణాదేవి :—(నిట్టూర్పుతో) ఎంతపని జరిగినదోయి తండ్రీ! మమ్ముల నెంత మోసము చేసితివిరా బిడ్డా!

వాసుదేవశాస్త్రి :—సాధారణముగ ప్రజాసామాన్యమును ముంచు అజ్ఞానమే నిన్నును ఆవరించినది. కాలవైపరీత్యమును బట్టి పెద్దలు పిన్నలకు నీళ్లు వదలుట వికృతమే, కాని ఎవ్వరమైనను 'ఉట్టి కట్టుకొని యూఁగుదుమా' యేమి?—

మచ్చిక వీరికెల్ల బహు
మాత్రముఁ జోద్యము దేహి పుట్టుచుం
జచ్చుచు నుంటఁ జూచెదరు,
చావకమానెడు వారిభంగి నీ
చచ్చినవాని కేడ్చెదరు,
చావున కోర్లక డాఁగవచ్చునే?
యెచ్చటఁ బుట్టె నచ్చటికి
నేఁగుట నైజము ప్రాణికోటికిన్.

ఐహికబంధముల నంటిపట్టుకొని ప్రాఁకులాడు నన్నాళ్ళు మన
ము నిత్యానందమును పొందఁజాలము. కాన, ఇట్టి సం
భవములు మంచిగనే పరిణమించి మనలను కను వి
ప్పునట్టుగఁ జేయును. తాత్కాలిక సంతాపము సహ
జము.—

కడలే దాశాలతకుం,
గడఁజూడఁగ నేరరాదు కడఁ గనిరేనిం
గడుముదమున సంసారము
కడఁగందురు తత్త్వవిదులు కమలదళాక్షీ!

ఇంతకును, ఒక్కసంగతి ఆలకింపుము:—

దేహము వాయుసంచలిత
దీపిక, పుత్త్రకళత్త్రమిత్త్రసం

దోహము స్వప్నకాలమునఁ
దోఁచెడు సందడి, రాజ్యభోగ స
న్నాహము జంత్రపుం బ్రతిమ
నాట్యము, సంపద యింద్రజాల; మీ
యైహిక సౌఖ్యమేమి సుఖ
మంచుఁ దలంపుడుమయ్యొ! ప్రేయసీ!

వాఁడు 'వీరస్వర్గము'నంది ధన్యుఁడైనాడు, కావున నెంత మాత్రము విచారింపవలసిన పనిలేదు.

అన్నపూర్ణాదేవి :—మీ వేదాంతము ఈ యజ్ఞురాలి నూఱడింపఁ జాలకున్నది. 'కన్నప్రేమకంటె పెంచిన ప్రేమ యెక్కుడు' గదా! నాశోకాబ్ధికి దరి గనలేకున్నాను. (కన్నీటితో) అయ్యో! అయ్యో! కొడుకా!—

మేను మృదుశయ్య సగము నామేనిమీఁద
సగముగాఁ జేర్చికొని ముద్దు మిగుల నిద్ర
సేయునట్టి నీ విప్పుడు చెనఁటి నేలఁ
దనువు వొందుట కోర్చితే తండ్రి! చెపుమ.

నిశ్చయముగ దేవుఁడున్నాఁడా! ఉండియేయున్నచో-దయామయుఁడను మాటయే సత్యమైనచో—దీనురాలి నిట్లు ఉపేక్షించునా! ఇట్టి ఘోరమగు కడగండ్లకుఁ బాల్పడఁ జేయునా! అంతటి క్షమింపరాని పాతకము లొనరించి యుంటినా!—

కలుగిడే నాపాలి కలిమి సందేహింపఁ
గలిమి లేములు లేక కలుఁగువాడు
నాకడ్డుపడరాఁడె నలిన సాధువులచేఁ
బడిన సాధుల కడ్డపడెడువాడు
చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక
చూచువారలఁగృపఁ జూచువాడు
లీలతో నామొఱాలింపఁడే మొఱఁగుల
మొఱ లెఱింగుచుఁ దన్ను మొఱఁగువాఁడు
అఖిల రూపముల్ దనరూప మైనవాఁడు
ఆది మధ్యాంతములులేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపడె వేగరాఁడె!

దైవమా! నాప్రార్థన లరణ్య రోదనములేనా?—ఊహుఁ!—
ఇఁక నీ సంతాపము భరింపజాలను!—భరింపజాలను!—
ఎవరింజీరుదు? నెందుఁజొత్తు?ఁ దెరువే?
దేలాగు మాలాగు? ది
క్కేవ? రీఘోర భవాన లార్చులకు నె?
ట్లోఁ దప్పుదుం? జాలి ద
ల్పవె; చిచ్చార్పవె; యశ్రువుల్ దుడువవే;
పాలింపవే; దీన బాం
ధవ! యార్తావన! యాకృపాబ్ధి! పరమా
త్మా! భక్తచింతామణీ!

రాఘవరావు !— ఇఁక సత్యము దాఁపజాలను మి
త్రమా ! కడుపు తెఱుగుకొని పోవుచున్నది శ్రీహరీ !

శ్రీహరి :—కొంచె మోపిక పట్టుమోయి రాఘవా !
(వారితో) తాతగారూ ! మాకు దాహముఁ దీర్చినం
దుల కివే వందనములు. కృతజ్ఞతా సూచకముగ మీ
కత్యానందదాయకమగు శుభసందేశ మొకటి దెల్పె
దను. ఈ రాఘవరావుగారే......

అన్నపూర్ణాదేవి :—ఆ ! ఏమి నాయనా ! అదే, అదే మా
వాని పేరు. వాఁడు బ్రదికియున్నాఁడా ?

వాసుదేవశాస్త్రి :—(ఆమెతో)—

ఆయనను పూర్తిగఁ జెప్పనిమ్ము.

శ్రీహరి :—మీ రాఘవరావు సజీవుఁడై క్షేమముగ నున్నాఁడు.
అవ్వగారూ ! చక్రవర్తిగారి సేనయం దున్నతోద్యోగ
ము వడసి, శాశ్వతకీర్తి సంపాదించినాఁడు.

సంతతి లేదనియెడు ఘన
చింతనముల నరసి ముదిసి చిక్కిన మీకున్
సంతతి గలిగెను భాగ్యము
సంతతిహీనులకు సౌఖ్య సంతతి గలచే.

వాసుదేవశాస్త్రి :—ముసలివారమని మమ్ములఁ బరిహసించు
చున్నావా నాయనా !

శ్రీహరి :—తాతగారూ, ఎంతమాట! తమవంటి పెద్దలతో నాకుఁ బరియాచకములా? రామరామ! ముమ్మాటికి నిజమే. ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను, నమ్మరదా?

అన్నపూర్ణాదేవి :—ఆహా! దైవకృప! ఈశ్వరప్రసాదము! ఈ కన్నులకు వానిఁ జూచు భాగ్య మెన్నఁడయిన లభించునా!

వాసుదేవశాస్త్రి :—ఈజన్మమున కింతకంటె వలయు నదృష్ట మెద్ది? ఈశ్వరా!—

నీమాయఁ దెలియ వారలె
తామరసాసన సురేంద్ర తాపసులైనన్
ధీమంతులు నీభక్తి సు
ధామాధుర్యముసఁ బొదలు ధన్యులు దక్కన్.

శ్రీహరి :—(రాఘవుని చూపించుచు) అమ్మా! అవ్వగారూ!—

చచ్చిన బాలుఁడు గ్రమ్మఱ
వచ్చిన క్రియ వచ్చెఁ బెక్కు వర్షములకు నీ
సచ్చరితు నేఁడు గంటిమి
చెచ్చెర మున్నెట్టి తపము సేయంబడెనో!

రాఘవరావు :—తల్లీ! వీఁడే మా రాఘవుఁడు! వీఁడే మా చేతులలోఁ బెరిఁగిన రాఘవుఁడు! మా ఋణము నంతయైనఁ దీర్చుకొనుటకు తహతహపడుచు వచ్చిన రాఘవుఁడు వీఁడే!

అన్నపూర్ణాదేవి :—(కౌఁగిలించుకొని, ఆనందబాష్పములతో) ఆ! ఏమిరా, నాయనా! నీవు నా రాఘవుఁడవే!—

నన్నుఁ గన్నతండ్రి! నాపాలిదైవమ!
నా తపఃఫలంబ! నా కుమార!
నాదు చిన్నివడుగ! నా కులదీపక!
రాఁగదయ్య, భాగ్యరాశివగుచు.

నీ నగవులు, నీ చూడ్కులు,
నీ నానావిహరణములు నీ ధ్యానంబుల్
నీ సర్మాలాపంబులు
మానసముల నాటి నేఁడు మగుడవు తండ్రీ!

వాసుదేవశాస్త్రి :—అదిగో! అదిగో!! సరిగా మా బాబు రాఘవుని స్వరమే!—నాయనా! నాకు చూపానదు. ఇటు వచ్చి ఒక్కసారి తొడపైఁ గూర్చుండు బాబూ!

(రాఘవరావు కూర్చుండును.)

వాసుదేవశాస్త్రి :—(రాఘవుని శరీరము నిమురుచు) నీ సుందర రూపముఁ జూచి యానందించుటకీ పాపిష్ఠపు కన్నులు నోచుకొనలేవు గదరా తండ్రీ!

రాఘవరావు :—నేను వచ్చువఱకునైన మీదృష్టి నిలిపియుంచఁగూడదా నాయనగారూ, ఆ నిర్దయుఁడైన బ్రహ్మ?

వాసుదేవశాస్త్రి:—చింత పడకుము నాయనా! కర్మఫలము తప్పదే—

రాకన్నానవు హానివృద్ధులు మహా
రణ్యంబులో డాగినన్
పోకన్నానదు దేహ మేవిధమునన్
బోషించి రక్షించినన్
కాకన్నానవు పూర్వజన్మకృతముల్
కాగల్గు సర్థంబులున్
లేకన్నానవు ఎంత జాలి పడినన్
లేముల్ సిరుల్, రాఘవా!

రాఘవా! నీవు నా రాఘవుఁడవే. పూర్తిగ నమ్మితిని. పరమానంద మైనది. కాని, యెంత కాలమైనదిరా బాబూ, నీమృదు తనుస్పర్శమువలని తన్మయత్వమును చెంది! ఇట్టి సుకుమారుఁడ వెటులా కఱకు యుద్ధమునకుఁ బోయి నెగ్గి వచ్చితివో గద!

రాఘవరావు:—నాయనగారూ! మిమ్ము వీడి నేఁటికి పదునైదు దీర్ఘ వత్సరములు దాఁటినవి. నేను "బస్సరా" నుండి వచ్చి దేశములో కాలుపెట్టి మూఁడు దినములైనది.

వాసుదేవశాస్త్రి:—ప్రేమమూర్తి నిన్నెంత త్వరితముగ తెచ్చెనురా బాబూ, మా చెంతకు?

అన్నపూర్ణాదేవి :—(రాఘవుని జేరదీసి) ఎంతవాఁడవైతివిరా నాయనా! రాఘవా! నీ శరీరమెంత మార్పుఁ జెందినను, సహజసౌందర్యము మాత్రము చెక్కు చెదరక నిలిచి యున్నదిరా, కొడుకా!

వాసుదేవశాస్త్రి :—ఆ రెండవవారెవరు, బాబూ!

శ్రీహరి :—ఇట్టి దివ్యవైభవముఁ గాంచుటకు వచ్చిన పథికుఁడను, తాతగారూ!

రాఘవరావు :—నాయనగారూ! ఇతఁడు నాబాల్యమిత్ర రత్నము, శ్రీహరి. మీ తరువాతి శ్రేయోభిలాషి నా కితఁడే.

అన్నపూర్ణాదేవి :—అటులా, బిడ్డా! ఆయన పేరను మాత్రమే శ్రీహరి కాఁడు. జగన్నాటకసూత్రధారుఁడగు నా మాయశ్రీహరియే ఈ రూపమున వచ్చి మనకు శుభయోగముఁ గావించినాఁడు. 'నీ మిత్రుడు శీఘ్రముగ బిడ్డలతండ్రి యగుఁగాక!' యని మనసార దీవించుటకంటె వేఱేమి ప్రత్యుపకారము చేయఁగల దీ పేదరాలు?

శ్రీహరి :—ఇంకను పెండ్లియే లేనిదే!

—(నవ్వుకొనును.)

అన్నపూర్ణాదేవి :—ఆహా! కృపాసముద్రుఁడగు భగవంతుని మహిమలు దుర్విజ్ఞేయములు గదా! దుఃఖము పట్ట

లేక ఆయనను తూలనాడి పాతకమున కొడిగట్టు కొంటిని, ఎంతటి మూఢురాలను.—

కమలదళాక్ష. దుఃఖలయ
కారణమై తగు తావకీన రూ
పము ననివార్య దుర్భర వి
పద్దశ దుఃఖము నొందువారు నీ
సుమహిత సత్కృపాగరిమఁ
జూపుటకంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొండొకటి
గల్గునె భక్త ఫలప్రదాయకా!

వాసుదేవశాస్త్రి:—కాలచక్ర మెట్లు తిరుగవలెనో, ప్రతి జీవికిని పరమాత్ముఁడు నిర్ణయించియే యుంచినాఁడు. ఆ రహస్యముఁ దెలిసికొన మానవ మాత్రుల కసాధ్యము.—

అరయఁగ శుద్రభూత హృద
యంబుల యందున సంతరాత్మవై
తిరముగ నుండు నీవు భవ
దీయ పదాంబురుహద్వయార్చనా
పరమతులైన మాహృది శు
భప్రదభూరి మనోరథంబు లీ

వెలుఁగవె భక్తలోక హృద
యేప్సితదాయక ముక్తినాయకా!

రాఘవరావు:—తల్లీ! ఈ పదునైదు వత్సరములును మీరె న్నెన్ని యిక్కటులు పడవలసి వచ్చెనోకదా! మీయు భయులకును ఎట్టి హృదయవేదన గలిగించి, పాపము గట్టికొంటిని! జననీజనకులారా! ఆపదలు కాపురముం డునా? శ్రీహరి కృపవలన ఈ క్షణమే మనకష్టములు గట్టెక్కినవని నమ్ముఁడు. మీ పరిచర్యలు దప్ప నాకిఁక వేఱు పని లేదు.

వాసుదేవశాస్త్రి:—పరమసంతోషము, బాబూ! కాని పొరుగూరిలో నున్న నీ సోదరులకు అం-డ-గా—

రాఘవరావు:—నాయనగారూ! ఆమాటమాత్ర మెత్తకుఁ డని ప్రార్థించెదను. ఈ లోకములో నా కితర విష యము లన్నియు మీ తరువాతివే. మీ ఋణముఁ దీర్చుకొనుటయే నాకు జన్మసాఫల్యము. 'నాది' యనున దొక్క పైస యున్నను, మీసౌఖ్యము కొఱకే వినియోగింతును. దిక్కులేని పక్షిని చేరఁదీసి, యింతవానిఁ జేసిన మీరలుగాక మఱెవ్వరు నాప్రత్యక్షదైవతములు! మిమ్ములను విడనాడుదునని కలనైనఁ దలఁపకుఁడు.

అన్నపూర్ణాదేవి :—నీ జాలిగుండె నే నెఱుఁగనిదా నాయనా! నాచిట్టి రాఘవుఁడు వచ్చి యెప్పటికయిన మమ్ముఁ బోషింపక పోవునా యను ఆశ నే నెప్పుడును వీడలేదురా బిడ్డా!

రాఘవరావు :—అమ్మా! మన మీ పాడుకొంప వదలి వెంటనే మంచి బసకుఁ బోవలెను. రైలుపేటలో వెంకటరావుగారి యిల్లు ఖాళీ యైనట్లు వింటిని, కనుఁ గొని వచ్చెదను. ఇచట దొరకనిచో సౌఖ్యప్రదమగు మఱొక యూరు పోవుదము తల్లీ!

వాసుదేవశాస్త్రి :—నాయనా! ఈగ్రామముననే తగిన యి ల్లు కుదుర్పుము. 'జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసి' అను విజ్ఞుల సూక్తులు నిరంతరస్మరణీయ ములు గద! కాన, 'జన్మస్థలమున' నీ చేతులమీఁ దుగ మట్టి యగుటయే నాకు మిగిలియున్న కోరిక.

అన్నపూర్ణాదేవి :—రాఘవా! మీతండ్రిగారి యభీష్టము నెఱవేర్చుటయే నాకుఁ గావలసినది.

రాఘవరావు :—ఇంతకంటె నాకుమాత్రము కావలసినదే మి? తప్పక యటులే కానిండు. మీ యిష్టమే నా యిష్టము. ఇపుడు నే మాటాడఁబోవు నింటికి హంగు లన్నియు కుదిరియున్నవి. ముందు వెనుకల పెరడు,

పశువులసాల, స్నానపుగది, ఇంక నెన్నియో సదుపాయము లున్నవి.

వాసుదేవశాస్త్రి :—అబ్బో, అంత యిల్లే! కానిమ్ము. పది మందికి సరిపడునటులు 'భజనకూటము' మాత్రము చక్కఁగ నమర్చుట నాకు హితము, నాయనా !—

'చేతులారంగ శివునిఁ బూజింపఁడేని,
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని,
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని,
గలుగనేటికిఁ దల్లుల కడుపుఁజేటు'

అనికదా కవిసార్వభౌమపోతనార్యుని దివ్యబోధము! అదియే నాకు చిన్ననాఁటినుండియు నమృతోపమానోపదేశమైనది. అదియును గాక,—

నారాయణుని దివ్యనామాక్షరములపైఁ
గరఁగని మనములు గఠిన శిలలు
మురవైరి కథలకు ముదితాశ్రురోమాంచ
మిళితమైయుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యౌదలనున్న
కనక కిరీటంబు గట్టిమోపు
మాధవార్పితముగా మనని మానవు సిరి
వన దుర్గ చంద్రికా వైభవంబు

> కైటభారి భజన గలిగి యుండనివాఁడు
> గాలిలోన నుండి కదలు శవము
> కమలనాభు పదముఁ గనని వాని బ్రదుకు
> పసిఁడికాయలోని ప్రాణి బ్రదుకు.

కనుక రాఘవా! ఇతరాలోచనములు కట్టిపెట్టి నా కోరిక నెఱవేర్పుము బాబూ!

రాఘవరావు :—నాయనగారూ!—

> పనుపక చేయుదు రధికులు
> పనిచిన మధ్యములు పొందు పఱతురు, తండ్రుల్
> పనిచెప్పి కోరిపనిచిన
> పనిశము మాఱాడు పుత్రు లధములు తండ్రీ.

మీ మనస్సు కనిపట్టి యాచరింపఁజాలకపోయినందులకే కించ పడు చున్నాను; తాము తెలిపిన తరువాతకూడ నభీష్టము నెఱవేర్పకుందునా? తప్పక శిరసావహించెదను.

శ్రీహరి :—'పితృవాక్య పరిపాలక' బిరుదాంకితుఁడగు ఆ త్రేతాయుగపు రాఘవుని పావన చరిత్రము పురాణ పఠనముచే విని యానందించితిమి. కలికాలమున గూడ ధర్మము పూర్తిగ నశింపలేదని తార్కాణించు మన రాఘవుని ఆదర్శ దివ్యచారిత్రము కనులార గాంచి ధన్యత నొందితిమి. తాతగారూ! తా మెంతటి

పుణ్యాత్ములు! జీవిత చరమభాగమున నిట్టి ఉచ్చదశ లభించుట ఎన్ని జన్మముల పూజాఫలమోగద! పలు మాట లేల!—

ఇహసుఖలోలత హెచ్చిన యీనాఁడు
నిత్యలేఖాతతి నెత్తిమీఁద
యాయావరము సేయు నయ్యల నోటను
దుర్వార్త చెవులలోఁ దూఱుతఱిని
బుఱ్ఱ గుమ్మముదాఁకి బొప్పిగట్టిన వేళ
నుస్సని వేసారి యూర్చునపుడు
గొల్లసుద్దులయందుఁ గోవెలలందును
వేకువ సఱచేత వ్రేళ్ళకొనల

భజన గానంబులను భక్తవరులజిహ్వ
సత్కవుల కావ్యనాటక సమితియందు
నాకసమువోలె వ్యాపించు నట్టి పూత
నామముధరించు మిత్రు నెన్నంగఁదరమె!

రాఘవరావు:—శ్రీహరీ! పొగడ్తల కుప్పొంగు వాఁడను కానని తెలిసియు, నిట్టిధోరణితో ప్రసంగించుట భావ్యమా?

శ్రీహరి:—ముఖస్తుతికాదు మిత్రమా! ఉన్నది యున్నటులే వాకొంటిని.

అన్నపూర్ణాదేవి :—ఇన్ని శుభసమాచారముల నడుమ నా కెడతెగని యశ్రుధారలు పొరలి పాఱుచున్న వదేమో! నాయనా, రాఘవా! నీ కా జగద్రక్షకుఁడు నీవంటి సుపుత్రరత్నములనే ప్రసాదించి ప్రోచుఁగాక!—

హారికింబట్టపుదేవి, పున్నెముల ప్రో
వ, ర్థంపుఁ బెన్నిక్క, చం
దురు తోఁబుట్టువు, భారతీ గిరిసుతల్
దోనాడు పూఁబోఁడి, దా
మరలం దుండెడి ముద్దరాలు, జగముల్
మన్నించు నిల్లాలు, భా
సురతన్ లేములు వాపు తల్లి, సిరి యి
చ్చున్ నిత్యకళ్యాణముల్.

వాసుదేవశాస్త్రి :—తథాస్తు! తథాస్తు!! చిరాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు!!!—

దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవసఁబొందన్
దీనావన! నీ కొప్పును
దీనపరాధీన దేవదేవ మహేశా.

రాఘవరావు :—

తనదేశంబు, స్వభాష, నైజమత, మా
త్మ ప్రాక్కులాచారముం,
దన దేహాత్మల నెత్తెఱంగున సదా
దానట్లు ప్రేమించి, త
ద్ఘనతావ్యాప్తికి సాధనంబులగు స
త్కార్యంబులన్ సల్పఁగా
ననువౌబుద్ధి యొసంగు నీ ప్రజకు ; దే
వా ! భక్తచింతామణీ !

శ్రీహరి :—నేఁడుగదా ధన్యుల మైతిమి ! ఎట్టి సుదినము ! మా రాఘవునకు తప్పక జయమగుగాక !! ముమ్మాటికిని జయమగుగాక !!!—

నల్లనివాఁడు పద్మనయ
నంబులవాఁడు మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు గడు
విప్పగు వక్షమువాఁడు మేలుపైఁ
జల్లెడువాఁడు నిక్కిన భు
జంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘు
సత్తముఁ డిచ్చుత మాకభీష్టముల్ !

[యవనిక జాఱును.]

# తోడి దొంగలు

## (ఏకాంకిక)

[ఈ చిన్ని రూపకము అలెగ్జాండరు ప్రభువు కాలమునాటికి చెందినది. అయినను, సర్వకాలములకు వర్తించు - స్వర్ణాక్షరాలతో లిఖింపఁదగిన ధర్మబోధ. ప్రభువు వేయు ప్రశ్న ఒక్కొకటి ఆయనకు రాజనీతిలో గల ఇంగితజ్ఞతను ప్రస్ఫుటము చేయును. కొంతు జంకులు లేక పిడుగులు పడినట్టు దొంగ చెప్పెడి ఒక్కొక ప్రత్యుత్తరము అతనిలో అంతర్లీనమైయున్న సత్యస్వరూపమునకు ప్రతిబింబమని చెప్పవచ్చు.]

# తోడి దొంగలు

[గుడారములో అలెగ్జాండర్ ప్రభువు - సమీపమున సాయుధహస్తులగు పరివారము - ప్రభువు యెదుట శృంఖలాబద్ధుఁడగు నొక ఖైదీ; ఆతని ముఖ వైఖరి భయంకరముగ నున్నది.]

అలెగ్జాండరు :—ఓహో! నీవేనా! — కొల్లగొనుటలో నసమాన ప్రజ్ఞాధురీణుఁడ వను పేరు మ్రోగుచున్న ఆ థ్రేషియను దొంగల నాయకుఁడవు నీవేనా?

దొంగ :—అవును, నేనే. థ్రేషియన్ దేశస్థుఁడను, వీరవర్గానికి నాయకుఁడను.

అలెగ్జాండరు :—హా!—నాయకుఁడు, వీరవర్గమునకు నాయకుఁడు!!—

ఇటు చూడు—నీవు దొంగవు, పచ్చి దొంగవు. దోఁపిడిగాడివి. హంతవు. దేశమున పీడవలె దాఁపరించినావు. నీ ధైర్యమునకు మెచ్చితిని, కాని నీవు చేయు ఘోరాపరాధములకు మాత్రము శిక్షించి తీరెదను.

దొంగ :—శిక్ష పొందుటకు నే జేసిన నేర మేమి?

అలెగ్జాండరు :—ఏమని మెల్లగ నడుగుచుంటివా?—నా యధికారమును నీవు ధిక్కరించితివిగాదా, దేశ శాంతికి భంగము కల్గఁజేయలేదా? హింస, దోఁపిడి

—వీనినే నీ జీవితములో నిత్యకృత్యములుగఁ జేసి కొంటివి కాదా ?

దొంగ :—ప్రభూ! ఏలికకు నే నిప్పుడు బందీనై యున్నాను, నా భౌతిక దేహము తమ వశమైయున్నది. మీరేమి సెలవిచ్చినను పడియుండవలసినదే. కాని...సూక్ష్మ రూపమగు నా ఆత్మమట్టుకి జయింపరానిది సుమండీ! మీరు నాపై మోపు అపనిందలకు ప్రత్యుత్తర మీయవలసినచో నేను 'స్వతంత్రుని' అనే జవా బిత్తును.

అలెగ్జాండరు :—నిర్బంధములో నున్నంత మాత్రాన నీ వాక్స్వాతంత్ర్యము నరికట్టుట నా యభిమతము కాదు. నీవు చెప్పఁదలఁచినది నిర్మొగమాటముగఁ జెప్పవచ్చు.

దొంగ :—సరి. అయినచో, నే నొక ప్రశ్న వేసెదను, ముందు దానికి ప్రత్యుత్తరము చెప్పండు. దిగ్విజయ జీవితయాత్రలో 'తాము' చేయుచున్న పని యేమి ?

అలెగ్జాండరు :—నేనా ?—నే నొక వీరాగ్రేసరుని జీవితము గడుపుచున్నాను. 'కీర్తికాంత' నడుగుము, ఆపెయే నీకు జవాబు చెప్పఁగలదు. ప్రపంచమున మేరు ధైర్యశాలి యెవరు ?—అలెగ్జాండరే అని యామె ముక్తకంఠముతో చాటును. రాజులను ఏలెడి

రాజేంద్రు డెవరు ?—నా పేరు చెప్పి మఱియొక పేరు చెప్పను. యోధులను మించిన యోధాన యోధుఁ డెవరు ?—మొట్ట మొదట నన్నే పేర్కొనుము.

దొంగ :—నన్ను గుఱించి మాత్రము పలుకదా ఆ యశో దేవత ?—నా జట్టులో ఎంతలేసివార లున్నారు ! అటువంటి వీర శిఖామణులకు మేటి నాయకుఁడనైన నే నెటువంటి వాఁడనో—బడాయిలు చెప్పకొనుటెందులకు ? పీఁడు ప్రభువశమగుట అనుకొనినంత తేలిక కాదని పలికకు,—మూఁడు చెఱువుల నీళ్లు త్రాగిన తమ యోధవర్గమునకు, స్వానుభవమె కద !

అలెగ్జాండరు :—వేయి చెప్పు, లక్ష చెప్పు. నీవు మాత్రము వట్టిదొంగవు. నీచాతి నీచుఁడవు...

దొంగ :—పరాక్రమశాలివై దిగ్విజయయాత్రలో మొనగాఁడవై, నీవు చేసిన నిర్వాహకము మాత్ర మే మున్నది ?—అంతులేని సామ్రాజ్య కాంక్షతో న్యాయ ధర్మములు విడిచిపెట్టి, కృషి వాణిజ్యాది వృత్తులతో ప్రశాంత జీవితము నడుపుచున్న ప్రజానీకమును మారణహోమము చేసి, ఱెక్కలు మొలిచిన అగ్నిపర్వతమువలె దేశముపైఁ బడి ధ్వంస ధూళి చేసివైచి, ఎంతమంది నిరపరాధులను పొట్టఁ బెట్టుకొంటివి ? ఎన్నెన్ని రాష్ట్రములు

పాడువెట్టితివి? క్రూర రక్కసునివలె దయా దాక్షిణ్యములు విస్మరించి మఱి, యెన్ని రాజ్యములు కొల్లగొంటివి!—ఒక వందమంది బలగముతో నేను ఒక్క ముఠాను కూర్చుకొన్నాను; లక్షలాది యోధులతో సంస్థానములను నీవు సర్వనాశము చేసితివి. నేను సామాన్య సంసారులను దోఁచితిని. నీవు రాజులను రాష్ట్రములను బలిగొంటివి. నేను కొలఁది పల్లెలను తగులఁబెట్టితిని, నీవు సుందరము లగు మంచి పట్టణములను మంట గలిపితివి. సుక్షేత్ర ములయిన ఖండములు పెక్కింటిని శ్మశానవాటి కలుగ మార్చితివి.

నిజము చెప్పవలెననిన, నీవును నేనును తోఁడిదొంగ లమే. సామాన్య మానవుఁడ నగుటచే నేను చిన్న దొంగను. మహారాజువై పుట్టుటచే నీవు పెద్ద దొంగవు. అంతియె భేదము.

అలెగ్జాండరు:—నేను అధికార బలముచేఁ దీసికొన్నను ఔదార్యముతో తిరిగి నిచ్చివేసితిని. చిన్న చిన్న రాజ్య ములు కూలఁద్రోసినప్పటికి, అంతకు మించిన మహా సామ్రాజ్యములు స్థాపించితిని. కళలు పోషించితిని. తత్త్వమును తఱచి చూచితిని. వాణిజ్య మభివృద్ధి చేసితిని. విద్యా వికాసమునకు బాట లేర్పఱిచితిని.

దొంగ :—నేనుకూడ ధనికులనుకొట్టి పేదలకుఁ బంచిపెట్టితిని. వన్యమృగములవంటి మూఁకను చేరదీసి, వారికి సైనికశిక్షణ గరపితిని. సాధుబాధ మాన్పుటలో, శిష్టరక్షణ సేయుటలో వారు స్తుత్యర్హములయిన పరోపకృతులను ప్రదర్శించినారు.

నీవు చెప్పు తర్కములు తత్త్వములు నాకు తల కెక్కుట లేదు. కాని, లోకమునకు నీవలన కలిగిన నష్టమునకు చెఱుపునకు హింసకు పార మున్నదా! ఇందుకు తగిన పరిహారము కలదా? గుండెమీఁద చేయి వేసికొని ఆత్మపరీక్ష చేసికో. నే జెప్పుట యెందులకు?

అలెగ్జాండరు :—[ముఖాకృతి మాఱినది. యోచనామగ్నుడైనాఁడు.]

(భటులతో)—ఈతని బంధ విముక్తుఁ జేసి, ఇటుపై నెంతయు నాదరింపుఁడు.

(దొంగ నిష్క్రమించును.)

అలెగ్జాండరు :—[ఆత్మగతము]—

ఏమీ! నేనును దొంగనే? మా యిరువురకు నింతటి పోలిక యున్నదా!!—ఇంకను యోజింపవలె...

# శృంగభంగము

[మానవ జీవితములో స్తుతిపాఠమునకు మించిన అపకృతి
మఱియొండు లేదని మహనీయుఁడు బెన్జమిన్ ఫ్రాంక్లిన్
స్వానుభవమున చెప్పినాఁడు. ఆతఁడు విద్యార్థిగ నున్న
ప్పుడు ఇంటినుండి బడికి పోవు దారిలో నొక కమ్మరి
కార్ఖాన యుండెను. అచ్చట జరుగు పనుల నితఁడు విం
తగ జూచుట కనిపట్టి, కార్ఖాన యజమానుఁడు ఫ్రాం
క్లిన్‌ను చేరఁదీసి మచ్చిక జేసి, పొంగ వేసి పనులు చేయిం
చుకొనెడు వాఁడు. మాయ మర్మము తెలుగని బెంజమిను
ఉబ్బులింగఁడై ప్రతిఫలాపేక్ష యెఱుఁగని స్వార్థరాహి
త్యముతో ఆ పనులన్ని చక్కబెట్టెడువాఁడు. అందువలన
ఆతని చదువు చెడిపోయినది. పెరిగి పెద్దయైన తదుపరి
ఇందలి అంతరార్థమును గ్రహించినాఁడు బెంజమిను. ఎవ
రయిన తనను వినుతించినయెడల, అది విషతుల్యముగ
నెంచి కంటగించుకొనువాఁడు; ఎందుల కిట్లు పొగఁడు
చున్నారా యని వేవిధముల వితర్కించుకొనెడువాఁడు.

ఈ లోకమున పొగడ్తలచే పనులు సాధించుకొనఁ
జూచుట మానవ నైజము. సహజసిద్ధమగు ఈ స్వభావ
మును వారించుట కష్టము. కాని, తరుణములో
గ్రహించి, దాని బారిఁబడకుండుటయె వివేకలక్షణము.

నీచులయిన సేవకులు యజమాను నెటుల వంచింప
గడంగిరో, రాజు ప్రయోగించిన చతురోక్తిచే కథ అడ్డము
తిరిగి, వా రెట్లు పరిభవింపబడిరో ఈ చిన్ని సంభాషణలో
చక్కగ చిత్రితమయినది.]

# శృంగభంగము

పా త్ర ము లు :

కెన్యూట్ :—ఇంగ్లాండు దేశపు రాజు

ఆఫా:—
ఆస్వాల్డ్ } రాజసేవకులు

రం గ ము:

[సౌతాంప్టన్ సమీపమున సముద్రపుటొడ్డు-కెరటములు వచ్చుచు పోవుచు నుండును.]

**కెన్యూట్:**—మిత్రులారా! రాజులలో నెల్ల నేనే మేటిననితఱచు చెప్పుచుండెడి వారలుగదా, అది వాస్తవమేనా ?

**ఆఫా:**—నిశ్చయమే, ప్రభూ! తామెల్లరకంటె ప్రతిభాశాలులు.

**ఆస్వాల్డ్:**—మే మందఱము తమ బానిసలము; మీ పాదరజము శిరస్సున ధరింతుము.

**ఆఫా:**—మేమే కాదు, పంచభూతములు నటులే. భూదేవి తమకు ప్రణమిల్లును; సముద్రుఁడు తమయాజ్ఞ శిరసావహించును...

కెన్యూట్:—ఈ మహాఘోషకుడగు సముద్రుడు నాకు లొంగునా? పంచమహాభూతములలో చేరిన సాగరుడు ఈ మానవమాత్రుని యాజ్ఞ పాటించునా?

ఆఫా:—ప్రభూ—అటులు కాదు. ముమ్మాటికి సముద్రుడు ఏలికకు దాసుడే; అతడు తమ పడవలన్నియు భుజములపై నిడికొని మోసికొనిపోవును; ధనలక్ష్మిని గొనివచ్చి ఏలినవారి పాదపద్మముల కర్పించును. సముద్రుడు తమ శత్రువులకు భీకరుడు గాని, తమకు వినయవిధేయభృత్యుడే.

కెన్యూ:— అగుచో, అలలు మీదికి వచ్చుచుండుట లేదా?

ఆస్వాల్డ్:—నిశ్చయమే, ప్రభువువారి కది గోచరించుచునే యున్నది.

కెన్యూట్:—సరే, ఒక కుర్చీ తెచ్చి ఈ యిసుకతిన్నెపై వేయుడు.

ఆఫా:—మహాప్రభూ! చూచితిరా? ఇపుడు కెరటములు రాలేదే! బిరి గీసినట్లుగా టక్కున ఆగిపోయినవి.

కెన్యూట్:—అవును, నిజమే. కుర్చీ నిట వేయుము.

ఆస్వాల్డ్:—(రహస్యముగా) ఇదంతయు నెందుకో అకో?

ఆఫా:—(రహస్యముగా) మనల నమ్మునంతటి మూర్ఖుడు కాడుసుమా రాజు!

కెన్యూట్:-శక్తిస్వరూపుఁడవగు నో శరనిధీ! నీవు నా ప్రజా వర్గములోని వాఁడవఁట. నాసేవకులు చెప్పుచున్నారు. అందుచే, నాయాజ్ఞ నిర్వర్తించుట నీ విధి. కనుక ఇదిగో, నీవు వెనుకకు మరలిపోవలెనని నే నాజ్ఞాపించుచున్నాను. పొంగి పొరలు నీ యలలను వెనుకకు లాగుకొనుము. నీకు ప్రభువ నగు నా పాదములు తడుపకుము.

ఆస్వాల్డ్ :—(రహస్యముగ) సముద్రుఁడు ప్రభువు నాజ్ఞ నాలకించునని తోఁపదు.

ఆఫా: —(రహస్యముగా) ఈసారి తరంగము లెంత్త చొరఁబాటి మీఁదికి వచ్చుచున్నవో.

ఆస్వాల్డ్ :—(రహస్యముగ) ఆ వచ్చు కెరటము సరాసరి కుర్చీకడకు వచ్చునటు లున్నది. ఇఁక మన మిట నుండుట యవివేకము. ఉప్పునీటిలో తడిసిపోదుము. పైగా...

[ఒక పెద్ద కెరటము వచ్చి కొట్టును.]

కెన్యూట్:—నేస్తులారా!- చూచితిరా, సముద్రుఁడు నా మాట చెవిని బెట్టెనా? అతఁడు నావాఁడేయైనచో, తిరుగఁబడు సేవకుఁ డన్నమాట. ఎంతటి చొరవతో పొంగిపొరలి, కోపమున నురుఁగులు నా శరీరముపై చిమ్మి, తుంపరలతో నన్ను ముంచివైచుచున్నాఁడో చూడుఁడు. స్తోత్రపాఠకులారా! తుచ్ఛములగు మీ

యసంబద్ధ ప్రలాపములకు నేను మోసపోయితినని తలచితిరి కాఁబోలును! మీ స్తుతిపాఠములకు నే నుబ్బిపోయితి ననుకొంటిరేమి?

వందిమాగధులవలె స్తోత్రపాఠములు చేసి, నన్ను వంచింప నెంచిన మీ రిప్పుడైన బుద్ధి తెచ్చుకొనుఁడు. ప్రపంచములో నొక్కనికి మాత్రమే సముద్రుఁడు లొంగియుండునని తెలిసికొనుఁడు. అతఁడే భూలోకమునకు, స్వర్లోకమునకు అధిపతి, ప్రభువులకెల్ల ప్రభువు, సార్వభౌములకెల్ల సార్వభౌముఁడు. "నీవక్కడకు పొమ్ము, ఇచ్చట నిలువుము" అని సముద్రు నాజ్ఞాపింప నతఁ డొక్కఁడే సమర్థుఁడు. ఈ విశాల ప్రపంచములో రాజు మానవ మాత్రుఁడు; మనుజుఁడొక కీటకమువంటివాఁడు. "నేనే భగవంతుఁడను, నాకీ పంచభూతములు లొంగియుండవలె" నని ఏ పురుషుడైన ననుకొనఁ దగునా?

ఇదిగో, నా ఈ కిరీటము తీసి వేయుచున్నాను. ఇఁక నేనది ధరింపనొల్లను. నన్ను నిదర్శనముగాఁ గొని, తదితరరాజులు వినమ్రులై యుందురుగాక! మీ కిపుడు జరిగిన శృంగభంగముఁ గాంచి రాజాశ్రయులు బుద్ధిఁ దెచ్చుకొని యిఁకముందు సత్యవాదు లగుదురుగాక!

# సంసార నౌక

[తల్లి : శారద—కూఁతురు : అమ్మాణి]

*

అమ్మాణి :—అమ్మా! ఇఁక కుట్టు మానివేసెదనే. విసువు పుట్టుచున్నది.

శారద :—తల్లీ! ఒక్క చెయ్యిమాత్రమెకద కుట్టితివి. కొంచెము పనికూడ కాలేదే. ఇంకను బోలెడంత యున్నది పూర్తి చేయవలసినది.

అమ్మాణి :—పోసి, కొంతసేపు ఒరవడి వ్రాసికొనెదను: లేదా పత్రిక చదివెదను.

శారద :—నీ యుద్దేశము నాకు బోధపడినది. నే చెప్పినది తప్ప మఱి యేదయిన చేసెదవు. కాదూ?

అమ్మాణి :—అది కాదు. అమ్మా!—నాకు కుట్టు బాగుగ వచ్చునని నీకే తెలియును. ఇంతకంటె గొప్ప సంగతు లున్నవి కద నేర్చుకొనుటకు? వారి సరస్వతి చూడు. నాకువలె కుట్టుపని సరిగ చేతనే గాదు. అప్పుడే సంగీతము నేర్చుకొనుచున్నది. ఈ నెలనుండి హిందికూడ చెప్పించుచున్నారఁట!

శారద :—ధోరణి శ్రుతి మించుచున్నదే! కుట్టుపనిలో ఆరితేఱితినని గర్వించుచున్నావు. నీ మాట నిజమేయైనచో ఈ చిన్నరవికె కుట్టుట యింతసేపా? పిల్లలెపుడేపని చేయవలసియుండునో తల్లులకే బాగుగఁ దెలియునమ్మా!

అమ్మాణి :—ఎప్పటికయిన నివియన్నియు నేరవవలెకదా! ముందుగనే నేర్చుకొంటినేని నీవు సంతసింతువని యటు లంటిని.

శారద :—నిశ్చయమే కాని, అన్నిపనులు ఎల్లరకు నొకేవిధముగ నావశ్యకము కానేరవుసుమా. ఒకరికి అవసరమగు పని మఱియొకరికి నిరుపయోగము కావచ్చును.

అమ్మాణి :—ఎందుచేతనే అమ్మా?

శారద :—కన్నతల్లీ!-విద్య యనునది వారువారలు గడపవలసిన జీవితములకు అనుగుణముగను, సహకారిగను ఉండఁదగును. ఇంత యేల, స్త్రీ పురుషు లిరువుర జీవితములలో ఎన్నో వ్యత్యాసములు నీకు గోచరించుట లేదా!

అమ్మాణి :—అటులా అమ్మా! ఎల్లరు నొకేరీతిగ నుందురని తలంచుచుంటిని.

శారద :—లోకములో పురుషులకుఁ గల హోదాలఁబట్టి, ఉద్యోగములఁబట్టి స్త్రీల జీవనపథము నిర్ణయింపవలసి యుండును.

అమ్మాణి :—అవునవును. వర్తకులు - వైద్యులు - ఉద్యోగస్థులు-పురోహితులు—ఈ మొత్తరుగ పురుషులు వివిధవృత్తులలో నుండుచున్నారు.

శారద :—చూచితివా, మఱి? అట్టి పురుషుల కూతులు, భార్యలు ఎల్లరు నొకే విధముగ మనుగడలు సాగిం

చుట సాధ్యమగునా? మన యింట, నే నెటులు దిన చర్య జరుపుచున్నదియు గమనించుచుంటివి కద! ఉదయముననే మనకు వలయు బజారు సామగ్రి తెచ్చుటకు పట్టీ వ్రాసియిచ్చి దాలయ్యను పంపుదును. పాలికాపులచే పసుసంరక్షణ దగ్గఱనుండి జాగ్రత్తగఁ జేయింతును. తరువాత నీకు తమ్మునకు లాలపోసి, బువ్వ పెట్టి, చాకింటి దుస్తులు తొడిగెదను. పిమ్మట మీ నాన్నగారివి నావి - విడిచిన బట్టలుదికి ఆఱవేసెదను. కొంతసేపు మీతోపాటు నేనును రాట్నము వడకుచు, నీకు తమ్మునకు పాఠములు చెప్పుదును. ఇటువంటి వెన్నియో అవశ్యములగు పనులు అనుదిన జీవితములో అగపడుచునే యుండును. ఇవి యన్నియు పూర్తియైన పిదప, తీఱిక చేసికొని పత్రికలు పుస్తకములు చదువుదును. మన ధనలక్ష్మమ్మగారి యిల్లు చూచితివికద! ఆ యింటిలో పిల్లలుకాని పెద్దలుగాని ఎట్టి పనియు ముట్టుకొననవసరమే లేదు. అన్నిటికి నవుకరులే. అందుచే అక్కడ నెల్లపుడు సంగీతములు, రేడియోలు మున్నగు వినోద కాలక్షేపములకు సావకాశమున్నది.

అమ్మాణి:—కాని, కామేశ్వరిగారెప్పుడును ఇంటిపనిలోనే ఈఁదులాడు చుండును. భర్త వైద్యు లగుటచే పొరుగూళ్లు తిరిగి తిరిగి ఏ వేళకు భోజనమునకు

వత్తురో నిశ్చయము లేదు. పాప, మామె అను క్షణము నిరీక్షించి యుండవలసినదే!

శారద:—ఆమెమాత్రమే కాదు—పురోహితులు, వర్తకులు—ఇట్టివారి విషయమునఁ గూడ నటులే. వారు నిర్వహింపవలయు పనుల తీరు అట్టిది. ఎల్లరును వేళకింటికి చేరి, భార్యలను సుఖపెట్టఁగల ఉద్యోగస్థులు కాఁగలరా?

అమ్మాణి:—అమ్మా!—నీవలెనే నేనుకూడ ఇటులే ఇంటి పనులు చేయవలసి యుండునా?

శారద:—ఏమో తల్లీ!—నీ భవిష్యము నిపుడెట్లు నిర్ణయింపఁగలను? నీయదృష్ట మెటు లున్నదో నే కలగంటినా? నేఁ జేయు పనులు నీవుకూడఁ జేయ నవసరము ఉండదనిమాత్ర మూహింపఁ గలము?

అమ్మాణి:—కాని, అమ్మమ్మకు చదువు రాదంటివే, మనకు మాత్ర మెందులకీ చదువులు?—

శారద:—బిడ్డా! చక్కని ప్రశ్న వేసితివి. దేశ కాల పాత్రతల ననుసరించి అనువగుమార్పులతో 'ఏ యెండ కా గొడుగుపట్టిన'గాని జీవయాత్ర చేయుట దుస్తరము. మన పెద్దల కిప్పటివలె పాశ్చాత్య విద్యయు, నుద్యోగములును లేవు. ఇప్పటి తరములలో శరవేగముతో పలు మార్పులు జరుగుచున్నవి. వీనిని గురించి మఱొకప్పుడు విస్తరించి చెప్పెదనులే. పురుషుల

వృత్తుల పురస్కరించుకొని వారి కెల్ల విధముల
స్త్రీలు చేదోడుగనుండి 'అర్ధాంగి' యను మాట
సార్థక పఱుచుకొనవలెను. గ్లాడ్స్టను దొరవారి
సతీమణి ఆయన షికారు వెళ్లివచ్చునరికి, ఉత్తరము
లన్నిటికి జవాబులు వ్రాసి సంతకమునకు సిద్ధముగ
నుంచెడిదని మొన్న నీవు పత్రికలో చదివినది మఱచి
పోయితివా? పతిభక్తి యనునది భారతస్త్రీల కుగ్గు
పాలతో పెట్టిన ప్రసాదగుణము. వారి యౌన్న
త్యము దెల్పు కథ లెన్నియో నీవు పురాణములలో
చదివియుంటివిగదా?

అమ్మాణి:—అవునే అమ్మా! చదువుట వ్రాయుట నాకు
అవసర మన్నమాట.

శారద:—కాదా, మఱి?

అమ్మాణి:—ఇంకను ఏవో విషయములు నేను తెలిసికొన
వలె, నమ్మా?

శారద:—కుట్టుపని ప్రాముఖ్యము నీకు తెలిసియేయున్నది.
దసరాపండుగకు కుట్టించిన యుడుపులకై దర్జీవాం
డెంత కూలి పట్టుకొనిపోయెనో జ్ఞాపకమున్నదా?

అమ్మాణి:—అబ్బో, ఎనిమిది రూపాయీల పైచిల్లర.

శారద:—ఈ సొమ్ము సంసారకృత్యముల కెంత యుప
యోగపడియుండునో కొంచెము యోజింపుము.

అమ్మాణి:—ఇకమీఁద కుట్టుపనికై ఒక్క దమ్మిడియైనను కర్చు కానీయను.

శారద:—సంతోషమే తల్లీ! నీవంటి రతనాల కూఁతురుండఁగ నా కేమి కొదవ?—మఱి యొక సంగతి: గత లక్ష్మివారము శాస్త్రులవారి భార్య ఇక్కడి కెందుకు వచ్చినదో తెలియునుకదా!

అమ్మాణి:— తెలియ కేమి? పాపము, నీవు లెక్క చూచి పెట్టితివి గనుక సరిపోయెఁగాని, లేకున్న దొంగలెక్క కదూ, చెప్పి ఆమెను మాయపుచ్చ యత్నించినారు వారి గోడ పెట్టిన కూలీలు? ఎంత అమాయకురాలో!-

శారద:— లెక్కలు రాకున్నచో నీ పనియు నంతే. క్రిందటి సారి నే నెంత జాగ్రత్తతో పద్దు వేసినను చాఁకలిది బుకాయించినది కాదా? పద్దు పరక ఆధారము లేనిచో ఎంత చిక్కుగ నుండునో ఆలోచింపుము. అదియుఁగాక, సంసారమునకు సంబంధించిన జమా ఖర్చులు స్త్రీలే చూచుకొనవలెను. ఎన్నియో ముఖ్య మగు వ్యవహారములు నిర్వర్తించుకొనవలసిన పురుషుల నెత్తిపైన చిన్న చిన్న విషయములుకూడ వేసి వారల విసిగింపఁగూడదు. ఇట్టి వన్నియు మనమే చక్కఁబెట్టుకొనవలె. 'ఆయమును మీఱు వెచ్చ మనర్థక'మని పెద్దలు చెప్పుదురు. అందుచే లెక్కలు

చక్కఁగ నేర్చుకొనినఁగాని ఈయంశములు నెఱ
వేరవఁజాలవు.

అమ్మాణి:—సరే కాని, అమ్మా!-తమ్ముఁడు చదువుచున్న 'శారీరశాస్త్రము' కూడ నన్నొకప్పుడు చదువుమంటివే. అదెందులకు, ఆఁడువారికి?

శారద:—అమ్మాణీ!-లెక్కలకంటెకూడ నిది అత్యావశ్యకమైనదమ్మా! ఆ బల్లమీఁదనున్న ఎఱ్ఱఅట్ట పెద్ద పుస్తకమిటు తెమ్ము.

అమ్మాణి:—[తీసికొని వచ్చును.]

శారద:-[పుస్తకము' తెఱచి చూచి]-ఇక్కడనుండి చదువు.

అమ్మాణి:—[ఇట్లు చదువును]

"భారత దేశమున పురాతనకాలమందు స్త్రీపురుషులందఱకును విశేషముగ శారీరజ్ఞానము కలిగియుండె ననుటకు ప్రమాణము లనేకములు గలవు. కర్మకాండమున షోడశ కర్మములలో శిశువునకు జాత కర్మ తండ్రి జరుపవలయునని విధింపఁ బడి యుండుటచే గర్భాశయమునకు సంబంధించిన ప్రజననాంగముల విశేషము లన్నియు ప్రతి గృహస్థుఁడును తెలిసి కొని యుండవలెనని యేర్పడుచున్నది. గర్భాదాన మంత్రములందలి విషయముల పరికించినచో కర్మకాండమును జరిపింప నేర్పడియుండు ఉపాధ్యాయునకును శారీరజ్ఞాన ముండవలసినదని తేటపడఁగలదు. ఔర్ధ్వ

పౌహిక కర్మములలో అస్థిసంచయనమున స్త్రీలు
ఆయా యంగవిశేషములకు సంబంధించిన అస్థిభాగ
ములను ఏఱి సంచయనమునకు సిద్ధము చేసియుంచ
వలెనని చెప్పఁబడియుండుటచే స్త్రీలకుఁగూడ శారీర
శాస్త్రజ్ఞానముండవలయుననుట స్పష్టమగుచున్నది''

శారద:—అట్టివారి సంతతికి చెందిన, మనకుఁగూడ శారీర
శాస్త్ర పరిజ్ఞానము అవసరమంటువా, కాదా?

అమ్మాణి:—ఔనమ్మా, అవసరమే మఱి–మొన్నను నాన్న
గారికి వచ్చిన అచ్చు ఉత్తరముతో – శరీర మర్మ
శాస్త్రము, ఏవో రహస్యములు... పెద్ద పెద్ద అక్షర
ములు, అందమయిన బొమ్మలు గల జాబితాఁ వచ్చి
నది కదా, అవన్నియు నే నెప్పుడే చదువుట?

శారద:—నీ కెంత జ్ఞాపకమే, కన్నా!–ఆ పుస్తకములు నీవు
కలనైన స్మరింపఁగూడదు సుమీ! తెలుఁగు సొంటు
లేని ప్రముఖులు ధనాపేక్షతో చేయుచున్న దేశ
ద్రోహ మిది! అందుచేతనే కదా, మీ నాయనగారు
ఆ పట్టీని చూచి చూడకయె తునకతునకలుగ చించి
పాఱవైచిరి?

బాలబాలికలకు, సతీపతులకు, శోభ కూర్చు చక్కని
యంశములు సర్వజన సుబోధకముగ శ్రీ వావిలి
కొలను సుబ్బారావు పంతులుగారు రచించియు
న్నారు. అవన్నియు కావలెనని మీ నాన్నగారిని

కోరెదను. చదివి మననము చేసికొని యాచరింపఁ దగిన దివ్యబోధము లెన్నియో అందున్నవి.

అమ్మాణి:—'భక్తిసంజీవని' ప్రచురించుచున్న వాసుదాసుఁడేనా అమ్మా? వారి 'ఆర్యకథానిధి' నాచేత చిన్నప్పుడే చదివించితివి కాదా?

శారద:—ఆయనే తల్లీ! ఆ మహానుభావుఁడు రచించిన నీతి రత్నములే.

అమ్మా:—అమ్మా! మఱి—

శారద:—'మఱి' కాదు, తల్లీ!—ఇప్పటికీ విషయములు గ్రహింపుము. అదిగో, నాన్నగారు వచ్చుచున్నారు. దుస్తులందుకొని పాగాకొయ్యకు తగిల్చి, ముందు కాళ్లు కడుగుకొనుటకు నీళ్లిమ్ము.

# 'స్వతంత్రమే స్వర్గలోకము'

[ఇది—బానిసల వర్తకము సాగిన కాలమునాటికి సంబంధించిన ఒక రచన. అప్పుడే యను మాట యేమి ?— స్వాతంత్ర్య ప్రియులు ఈనాఁడయిన దీనిఁజదివి హర్షింపఁగలరు.]

యజమానుఁడు :—చీ, తులువా !—ఈసారి ఉడాయించఁబోయినందుల కేమి చెప్పుకొనెదవు ? ఎంతటి ఘోర శిక్ష విధించినను పాప మున్నదా ?

బానిస :—నే నేమి చెప్పుకొన్నను సార్థకము లేదని నాకు తెలియును. పోనిమ్ము—నా కర్మ మెటులో ఒక యటుల జరుగఁగలదు.

యజమానుఁడు :—ఎట్టి నీచుఁడవురా, నల్ల పాషాణమవు. మేలు మఱచెడి కృతఘ్నుఁడవు...

బానిస :—నేను బానిసను. ఇదే నే చెప్పు సమాధానము.

యజమానుఁడు :—అసందర్భపు జవాబు : ప్రసాద గుణములను సూచించెడి లక్షణములు కొన్ని నీలో నున్నట్టు గ్రహించి, అందుల కనుగుణముగ నిన్నాదరించితిని ; భోజన వసతులకు సదుపాయమయిన యేర్పాట్లు చేసితిని. నీ శక్తికి తగిన పనులే చెప్పి చేయించితిని. ఇంచుక అనారోగ్యముగ నున్నటులు పొడకట్టెనేని, ఎంతో కనికరముతో మందులు మాకులు ఇప్పించియుంటిని ; వలయు పరిచర్య లెల్ల చేయించి

తిని. ఇన్ని విధముల నిన్ను కనిపెట్టుచున్నందులకు నీవు చూపెడి విశ్వాస మిదే కద?

బానిస:—నన్నుకూడ ఒక మానిసిగ నెంచి మాటాడు చుంటివి గనుక, ఇప్పుడు సరియైన ప్రత్యుత్తర మిచ్చెదను: నీవు నాకు చేసిన దేమి?—నా 'స్వాతంత్ర్యము'ను లాగికొనినందులకు సరిపడు ప్రతిఫల మే మీయఁగలవు?

యజమానుఁడు:—ఎన్నడును నీ స్వాతంత్ర్యమును లాగి కొనలేదు. నేను నిన్ను న్యాయ్యముగ కొనుసరికే నీవు బానిసవు.

బానిస:—నీవు కొనుటకు నే నంగీకరించితినా?

యజమానుడు:—నీ ఒప్పందలతో పని యేమి? నీకు గల హక్కు అప్పటికే పోయినది.

బానిస:—లేదు, లేదు. ప్రతిఘటించగల శక్తి పోయిన దేమో కాని, హక్కు ఎటులు పోయినదయ్యా? నా దేశమున నేను న్యాయ్యమగు వృత్తిలో జీవనము గడపుకొనుచుండఁగా ద్రోహులు కొందఱు, నన్ను బలవంతముగ ఎత్తుకొనివచ్చిరి. గొలుసులతో బిగియగట్టిరి. మీ దేశస్థుఁ డొకఁడు నన్ను కొని, పడవమీఁదికి గెంటి, ఇక్కడకుఁ దీసికొనివచ్చి— సంతలో పశువులకువలె నన్నతఁడు అమ్మజూపఁగా నీవు కొంటివి. ధర్మము మాలిన ఈ దౌర్జన్య.

పరంపరలో నీ కార్యము సేయు హక్కు నిచ్చునది?
నన్ను బలిమిని దొంగిలిన ఆ ఖలునకు గాని, ఆతని
నిట్లు చేయ ప్రేరేచిన బానిసల వర్తకునకు గాని, నీ
సేద్యముకోసము మానవపశువులను పడవలకొలఁది
తెమ్మని వర్తకుని ప్రోత్సహించిన నీకుఁగాని—మీ
ముగ్గురిలో నెవరికైన ఎట్టి హక్కయిన గలదా?

యజమానుఁడు :—ఒకనికి మఱియొకఁడు ఊడిగము సేయ
వలయు ననునది ప్రకృతిసిద్ధము. అది దైవాజ్ఞ.
ఆది నుండియు నిటులే జరుగుచున్నది; ముందుకూడ
అంతే. ఇటువంటి ఆచార మున్నదని కనుగొంటినే
గాని, దాని నిపుడు నే సృష్టించలేదు.

బానిస :—నీవు సృష్టించలేదు, సరి. అయినచో—ఈ వాద
బలమునే ఆధారముగఁ దీసికొని, దొంగ నీ గుండెకు
తుపాకి గురిపెట్టవచ్చు నన్నమాట? నీకీ హక్కు
నిచ్చిన దేవుఁడే, నీ అర్థప్రాణములు రెండిఁటిని
అపహరించఁగల శక్తిని దొంగకు ఒసఁగియున్నాఁడు.
అంతియ కాదు. నా స్వాతంత్ర్యమును లాగికొన
నా శత్రువులకు బలము నిచ్చిన ఆ దేవుఁడే తప్పించు
కొని పారిపోవుటకు నాకు కాళ్లుకూడ అనుగ్రహించి
యున్నాఁడు. ఈశ్వరుఁడు ప్రసాదించిన ఈ అవ
యవములను ఏల వినియోగింపఁగూడదు?
అదియుఁగాక — అనుకూలమగు తరుణము చిక్కి

నపుడు అనుభవించిన అక్రమాలను వలపోసికొనుట కాటంక మేమున్నది?

యజమానుఁడు :—కృతజ్ఞత! కృతజ్ఞత!!—చేసిన మేలు నెన్నటికి మఱవకుము. నీ విక్కడకు వచ్చినప్పటి నుండియు ని న్నెంతటి దయతో చూచుచుంటిని? నీ దుర్దశ తొలగించుట కెంతగ యత్నించుచుంటిని? ఇట్టి యుపకృతి నావల్ల పొందుచున్న నీవు కృతజ్ఞత చూపుట విధికదా? మఱొక యజమానుని కొలువులో ఉండినట్టయిన, ఎట్టి దుర్భర స్థితిలో నుండియుందువో కొంచె మూహించుకో.

బానిస :—ఓహో!—మహా గొప్ప ఉపకారము చేసి పోతివి! ఆ మాటకు వచ్చిన, నీ గొడ్లకు చేసిన దానికంటె ఎక్కువగ నాకు చేసిన దేమున్నది? వానికి మేఁత వేయుచున్నావు. నాకును ఇంత తిండి పడవేయుచున్నావు. స్వలాభము కొఱకు పశువుల చేతను మానవపశువులచేతను ఒక్కలాగున పని చేయించుకొనుచున్నావు. నీవు శ్రీమంతుడవు—అందుచేతను కాసంత వివేకవంతుఁడవు. అగుట, భృత్యవర్గమును పోషించుటలో తోడివారికంటె కొంచెము మంచివాడ వనిపించుకొనుచున్నావు, అంతే.

యజమానుఁడు :—'మంచివాఁడ' ననే కాదు, అత్యంత కరుణాళుఁడ నని కూడా—

బానిస :—'క-రు-ణా!'—నీవు అంతటి శ్లాఘకు పాత్రుఁ

డవా?—నీ చిత్త చాంచల్యముచేత నేమి, నీ యను చరుల తదేక నిర్బంధమువల్ల నయిననేమి —తోడి మానవుల స్వాతంత్ర్య సర్వస్వమును ఏల కొల్లగొట్టుచుంటివి? ఆదాయమును వృద్ధి చేసికొని కులుకటకే గద? ఇట్టి నికృష్ట పరిస్థితులలో—పీడించెడి నిర్దయాత్మకుడగు యజమానునిపై సేవకుల కెట్లు కృతజ్ఞత కలుగు ననుకొనఁగలవు?—ఇదిగో, ఇటు చూడు. నేనును నీ వలెనే మానవ జన్మమెత్తలేదా? నాకును నీ కున్నటులే ధైర్యము, ఉత్సాహము ఉండవా?

యజమానుఁడు:—నీకు తెలియదు కాని—ఇప్పటి నీ జీవితము సుఖప్రదము చేయుటయె గాక, ముసలితనములో నీ సౌఖ్యముకొఱకు తగిన యేర్పాటు లాలోచించుచున్నాను.

బానిస:—అయ్యో, రామ!—'నా' యనువారందఱకు ఎడబాపులై, దేశము కాని దేశము చేరుకొని, సమస్తము వదులుకొని, పరాయి స్థలమున పడరాని పాట్లు పడుచున్న ఈ ప్రాణికా. ముదిమి చూడఁ గలనను యభిలాష! హా!—ఎంత శీఘ్రముగ ఈ లోకమునుండి సెలవు తీసికొనిన, అంత త్వరితముగ నా యాత్మకు విముక్తి ప్రాప్తించును.

యజమానుఁడు:—అట్లులైనచో. నిన్ను ఒద్దిలో నుంచు

టకు నిర్బంధము, కాఠిన్యము తక్క తదితర మార్గము లేదన్న మాట ?

బానిస :—ఆత్మకు నిర్బంధము లేదు. స్వేచ్ఛకు గల విలువను తెలుసుకొన్న వ్యక్తిని బానిసగ నుండ నొప్పించుట కేవలము అసాధ్యము.

యజమానుఁడు :—పోనిమ్ము, నీవు కోరుకొనెడి స్వేచ్ఛను తిరుగ నే కిచ్చెద ననుకో. అది ఉపకారముగ భావించెదవా ?

బానిస :—ఓ. మహోపకృతిగా పరిగణించెదను. అపహరించిన స్వేచ్ఛను మరల ఇచ్చుట యనిన, చేసిన పొరపాటును దిద్దుకొనుటయె. అయినను, న్యాయముకొఱకు ధర్మముకొఱకు స్వార్థమును త్యజింపగలవారు లోకమున అరుదుగ నుందురు. ఆ సంగతి నే నెఱుఁగుదును. అందుచేతనే, నీ సంకల్పము మహత్తరమయినదిగ భావించెదనంటిని.

యజమానుఁడు :—సరే. అటులే చేయుచుంటి. ఇటుపైన నీవు స్వేచ్ఛగానుండుము. సర్వ స్వాతంత్రమును అనుభవింపుము.

బానిస :—బానిసను కానుగాని, ఇపుడు నేను నీకు నిజమయిన దాసుఁడను. తెలిసినదా ?—నీవు ఒనర్చిన మేలునకు ప్రతిగా, మనసు విడిచి నీ యథార్థస్థితిని వెల్లడించెద, విను:

నీవు, నీ క్రింది సిబ్బందియు పెట్టుచున్న బాధ లన్ని
టిని సేవకులు అతి ఓరిమితో భరించుచున్నారు.
భరించుచున్నారు—కాని, ఎప్పుడు మీపైన కసి
తీర్చుకొనఁగలమా యని వారెల్లరు సమయము
కోసము వేచియున్నారు. తీరని పగతో నున్న ఇటు
వంటి శత్రుబృందము నిన్ను చుట్టుముట్టియున్నదని
కానుకోలేకుంటివి. విన్నావా?—
యావజ్జీవ దాస్యమునకుఁగాను నీవు ఇచ్చుటకు కొని
వచ్చిన వీరిలో—కొందఱు న్యాయశీలురు సయి
తము. నీవు చేసిన అన్యాయము తలఁచి తలఁచి
క్రోధావేశు లగుచున్నారు. నీవు చేసితి ననుకొన్న
స్వల్ప ఉపకృతులు వారి క్రోధపూరిత హృదయాలకు
ఊరట కల్గించునని మాత్రము భ్రమింపకుము.
వారిలోని మానవత్వమును మటుమాయముచేసి,
వారిని పశుప్రాయ స్థితికిఁదెచ్చినది నీవే. బరువులు
మోసెడి పశువులకు గల అజ్ఞానము వారికి లేదుకాని,
జంతువులను చంపుకొని తినెడి క్రూరమృగముల
క్రౌర్యము మాత్రము వారిలో విజృంభించుచున్నది.
ఉత్తమమయిన సాత్వికశక్తియే నీకెప్పటికైన రక్షణ
నీయఁగలది. అది నీలోన పూజ్యమయ్యేనేని, నీ వా
క్రూరుల బారిని పడితివన్నమాట.
యజమానునకు సేవకునకు గల చట్టుబైక మింతలో
నున్నది!

# వేదాంతి చిట్టెయ్య

[ధర్మారావుదొరగారు స్వారి బయల్దేఱినారు. దారిలో పువ్వులు కోయుదమని దిగినారు. ఆయన తిరిగి వచ్చుసరికి గుఱ్ఱము ఉడాయించినది. 'ఆఁగు, ఆఁగు... పంచకల్యాణీ!' అనుచు పేరుపెట్టి గట్టిగ పిలిచినారు, దొరవారు. అది ఆఁగినట్టుండుట, తీర దగ్గఱకు వచ్చుసరికి దౌడు తీయుట —ఇట్లు చేయుచున్నది. కొంతసేపటికి ప్రక్కన పొలములోనున్న చిట్టెయ్య ఇదంతయు చూచినాఁడు. గబుక్కున వెళ్లి ధైర్యముతో పట్టుకొని గుఱ్ఱమును ఆపి యజమానునకు ఒప్పజెప్పినాఁడు. ఆ కుఱ్ఱవాని సాహసము, అతని ముఖలక్షణములు చూచి, మహా సంతోషమయినది ధర్మారావుగారికి.]

* *

ధర్మారావు :— అబ్బాయీ !— మంచి తెలివితేటలతో పట్టుకొంటివోయి, మా గుఱ్ఱమును. చాలా సంతోషించినాము. నీకేమి బహుమాన మీయఁగలము ?

[జేబులో చేయి పెట్టినారు.]

చిట్టెయ్య :—నాకేమియు వలదండి.

ధర్మా :—వలదా ?–మఱియు మంచిది. ఇటు లెవ్వరును అనుట వినలేదు. సరి, నీవు పొలములో ఏమి చేయుచుందువు ?

చిట్టెయ్య :—గొఱ్ఱెలను మేఁపుచుందునండి. ఇప్పుడు దుంపలు త్రవ్వుచున్నాను.

ధర్మా :—నీకీ పని సరదాగా నున్నదా ?

చిట్టెయ్య :—ఓ...
ధర్మా :—పోనీ, పోయి ఆడుకోరాదూ?
చిట్టెయ్య :—నా కీ పని కష్టము కాదండి. ఆటకంటె ఎక్కువ ఖులాసాగా నున్నది.
ధర్మా :—నిన్నెవ రీ పనిలో పెట్టినారు?
చిట్టెయ్య :—మా బాబు.
ధర్మా :—అతగాఁ డేఁడీ?
చిట్టెయ్య :—అల్లదిగో, ఆ చెట్ల మరుగున పాకలో నున్నాడు.
ధర్మా :—అతని పేరు?
చిట్టెయ్య :—కిష్టమ్మ.
ధర్మా :—నీ పేరో?
చిట్టెయ్య :—చిట్టెయ్య అనెదరండి బాబూ.
ధర్మా :—నీ కెన్నేళ్లు?
చిట్టెయ్య :—రేపు సంక్రాంతికి ఎనిమిదీ దాటునండి.
ధర్మా :—అటులా? ఈ పొలములో ఎంతసేపటినుండి యుంటివి?
చిట్టెయ్య :—తెల తెలవారుచుండ వచ్చితినండి.
ధర్మా :—మఱి, నీకు ఆకలి వేయుట లేదా?
చిట్టెయ్య :—కాస్తంత సేపుండి, గంజికి వెళ్లెదనండి.
ధర్మా :—ఒరే కుఱ్ఱవాఁడా! నీ దగ్గఱ ఇప్పుడు ఆ రణాలున్న వనుకో, ఏమి చేసెదవు?

చిట్టెయ్య :—తెలియదు బాబూ, నాకడ అంత సామ్మొప్పు డును లేదండి.

ధర్మా :—నీయొద్ద ఆటసామగ్రి యేమీ లేదా ?

చిట్టెయ్య :—అదేమిటండి బాబూ ?

ధర్మా :—గోలీకాయలు, బంతులు. బొంగరాలూ—అలాంటివి ఆటవస్తువు లనంగా.

చిట్టెయ్య :—లేదండి. మొన్న తీర్థములో చెల్లికే కొన్నది మా యమ్మ—గంతులు వేసే కప్ప ఒకటి, నొక్కిన కూసే పిట్ట ఒకటిన్ని. కొన్నిలక్క సామానులు కూడ తెచ్చినది. నాకు ఆడుకొనుట కొక గుఱ్ఱము బొమ్మ ఉండెడిది. అది విరిగిపోయినదండి.

ధర్మా :—అయితే, నీ కేమీ అక్కర లేదా ?

చిట్టెయ్య :—వలదండి దొరగారూ! గొఱ్ఱెలను మేపుకొని వచ్చునప్పటికే సరిపోవును రోజల్లా. నాకు ఆడుకొనుట కంటె ఇదే సరదా.

ధర్మా :—సరిగాని, నీ యొద్ద డబ్బున్నయెడల, పండ్లు అప్పచ్చులు కొనుక్కొన వచ్చుకద!

చిట్టెయ్య :—అక్కఱ లేదండి. నాకు వలసిన వన్నియు మా అమ్మ ఇచ్చును. అవే చాలును.

ధర్మా :—పోనీ-పొలములో చెట్లు పుల్లలు కోసికొనవచ్చు, కత్తి ఇచ్చెదను, తీసికో.

చిట్టెయ్య :—నా దగ్గఱనే ఉన్న దొకటి. మా అయ్య ఇచ్చి నాడండి.

ధర్మా :—అయితే, చూడు. నీ చెప్పులు బొత్తుగా చినిగిపోయి నట్టున్నవే. ఒక క్రొత్త చెప్పుల జత కొనుక్కొనుము.

చిట్టెయ్య :—ఇంటివద్ద నున్నొకటున్నదండి; అది పండుగలకు వాడుకొనెదను.

ధర్మా :—ఒరే చిట్టీ!-నీ తలగుడ్డంతయు మాసికలు పడినదే!

చిట్టెయ్య :—పూర్తిగ చినిగిన తరువాత నెత్తి మాడునండి బాబూ. అప్పుడు క్రొత్తది కొనుక్కొనవచ్చు. అంతవఱకు కాలక్షేపమున కిది చాలు.

ధర్మా :—అబ్బాయీ! వర్షము వచ్చిన యేమి చేసెద వోయి?

చిట్టెయ్య :—వెలిసేవఱకు అల్లా మంచెక్రింద నూఱి కూర్చుండెదనండి.

ధర్మా :—ఒకవేళ ఇంటికి వెళ్లకముందే ఆఁకలిఅయినచో ఏమిచేసెదవు చిట్టెయ్యా?

చిట్టెయ్య :—ఉన్నవికా దా డీ దుంపలు?

ధర్మా :—ఇప్పు డున్నవిలే. అవియు దొరకనప్పుడు?—

చిట్టెయ్య :—నాకేమియు ఫరవాలేదండి. ఆయుబుసే తలఁపను.

ధర్మా :—మఱి,-ఈ వేసంగిలో నీకు దాహము వేయదూ?

చిట్టెయ్య :—ఆ చలమలో పంచదార్లవంటి నీళ్లున్నవండి. దప్పిక తీరుటకు అవి చాలునండి.

ధర్మా :—ఆరి చిట్టెయ్య, ఎంత వేదాంతివోయి!

చిట్టెయ్య :—ఏమిటం డయ్యా ?

ధర్మా :—నీవు వేదాంతి వనుచున్నాను. అనగా యేమో నీకు తెలియక కాబోలు.

చిట్టెయ్య :—తెలియదండి బాబూ! తెలియకుంటే ఇబ్బంది లేదు గద ?

ధర్మా :—లేదు, లేదు. [చిఱునవ్వుతో]-సరే, చిట్టెయ్యా!- నీ కేమీ అక్కఱలేనట్టున్నది. పోనీ, నీకు సొమ్ము ఏమియు నీయనులే. అయితే,—నీవు బడికి వెళ్లు చున్నావా ?

చిట్టెయ్య :—లేదండి. కోతలయిన తరువాత ప్రవేశ పెట్టెద నన్నాడండి, మా అయ్య.

ధర్మా :—మఱి, నీ కప్పుడు పుస్తకములు కావలె కదా ?

చిట్టెయ్య :—అవునండి, బడిలో తోడి పిల్లలందఱకు ప్రార్థన పుస్తకము, పేళ్ల పుస్తకము, ఎక్కాల పుస్తకము ఉన్నవండి.

ధర్మా :—సరే. చిట్టెయ్యా!—నీకు నేను ఆ మూడు పుస్త కములు కొని యిచ్చెదను. నీవు సంతుష్టి గల పిల్ల వాఁడివని సంతోషించినాను. ఇటు లని మీ బాబుతో చెప్పు. పో, గొఱ్ఱెలు కాసికో.

చిట్టెయ్య :—చిత్తము దొరగారూ! సెలవు తీసికొనెదనండి.

ధర్మా :—మంచిది.

# జయాప్రసూనములు

[ సంపాదకులు : శ్రీ ముద్దా విశ్వనాథము ]

'There is no past, So long as books shall live'—LYTTON.

'అనివార్యమైనయెడల ప్రాత చొక్కా తొడుగుకొనుము, కాని శక్తియున్నచో మంచిపుస్తకము కొనుట మానకుము. గత్యంతరము లేనప్పుడు చింపిగుడ్డలే కట్టుకొనవచ్చు, ఒక్కపూటయే తిని బ్రతుకవచ్చు, కాని సద్గ్రంథముల పట్టున మాత్రము ఎప్పుడును లోభివి గాకుము'.

—'ఆదర్శ సుఖజీవనము'

"నీ మిత్రులఁ బట్టియు, నీచేనుండు గ్రంథములఁ బట్టియు నీ నడవడిని బుద్ధిమంతులు గ్రహింతురు. కాల మల్పము. గ్రంథము లసంఖ్యాకములు. కావున స్వశ్రేయస్కాముఁడు సద్గ్రంథములనే చదువవలయును. తన బాలురచేఁ జదివింపవలయును. సద్గ్రంథవంతుఁడే. విశ్వాసపాత్రుఁడైన మిత్రుని, హితుఁడగు సచివుని, నుల్లాసియైన సహచరుని గల యదృష్టవంతుఁడు. వాఁడే విద్యావంతుఁడు.'

—శ్రీ వావిలికొలను సుబ్బారావు.

"పుస్తకములు మీ ఆదాయమునకు ఒక్కపైసా అయిన చేర్పకపోవచ్చు. కాని జీవితములో బడుదుడుకులనుండి రక్షణ కోరినప్పుడు—ప్రాపంచిక సౌఖ్యాలనుండి విరామము కోరినప్పుడు అవి మీకు తోడు నీడలై నిల్చును. తాపత్రయములతో చివికి శిథిలమయిన మీ హృదయానికి అమృతము చిలికించి, అంతకంటె సుఖతరమైన-రమ్యతరమైన జీవితమును చవిచూపును..

—శ్రీ కూచి నరసింహముపంతులు.

## ౧ ఆత్మజ్యోతి:

'చిత్తము శివునిమీద, భక్తి చెప్పులమీద' అను లోకోక్తిని తార్కాణించు, ఇరువురు యాత్రికుల పర్యటన గాథ. 'మానవ సేవయే మాధవ సేవ' యను మహావాక్యమును సార్థకముచేయు చక్కని యితివృత్తము. ఈ రెండు సూత్రములను అనుసరించిన యాత్రికుల మనస్తత్వములను టాల్‌స్టాయి మహర్షి అతిరమ్యముగ చిత్రించినాడు. వెలుగులు జిమ్ము గొప్పగొప్ప భావములతో నలదారుచున్నది.

## ౨ జన్మభూమి : (నాటిక)

ఇందు కథానాయకుడు రాఘవుని దేశభక్తి యొడలు పులకరింప జేయును. అన్నపూర్ణమ్మ వినయాదులు భారత నారీమణుల గుణప్రదర్శనమునకు దర్పణములు. ఇది 'ఆత్మజ్యోతి' తరువాత 'జ్ఞానజ్యోతి'యై ప్రకాశించుట అత్యుక్తికాదు.

## ౩ ప్రేమాంజలి :

ఈ మానవజీవితము ప్రేమమయము. ప్రేమయే దైవము. ప్రేమ లేనిది బ్రతుకే లేదు. అటువంటి మహత్తరమయిన ప్రేమతత్త్వమును టాల్‌స్టాయి ఋషిపుంగవుడు ఒక మహిమాన్వితమగు కథారూపమున అందిచ్చియున్నాడు. భూషని జీవితకథ ప్రారంభించినది మొదలు ముగించు వరకు విడువలేము.

## ౪ శుభోదయము :

చిలిపి కయ్యములు చివరి కెంతలేసి ప్రళయరూపములు దాల్చునో, చిచ్చు పెట్టునో ఇందు టాల్‌స్టాయి కన్నులకు కట్టినట్టు వర్ణించినాడు. ఇది చదివిన ప్రతివ్యక్తికిని 'చూరంటుకొన్నప్పుడే అగ్గి యారుపవలె'నను సూక్తి హృదయమున నాటితీరును.

౫ తూలిక :

మనోహర నీతి కథాసప్తకము. ఇందలి కథానికలు ఒకదానిని మించి నది మరియొకటి. మధురములగు నిందలి కథలకు హృదయ మొక భూమి కయై ఆనందాకాశమున నాందోళించుననుట చదువరులు స్వానుభవమున తెలిసికొనగలరు.

౬ సంధ్య :

మానవునకు అవసరమగు భూభాగమెంత?—'ఆరడుగుల నేల' యని ఈ కథద్వారా టాల్‌స్టాయి జగత్తుకు నచ్చజెప్పుచున్నాడు. గొప్ప వేదాంత భావములతో నిండారియున్న చిన్నికథ. రాజ్యకాంక్షచే తృష్ణాపరులు సంకుల సమరము సలిపి భీభత్సమును గలిగించుచున్న ఈ సమయమున 'సంధ్య' కథ సమయోచితమయిన గొప్ప గుణపాఠమును నేర్పుచున్నది.

౭ రామనామం :

రామచంద్రునివంటి రాజు లేడు-హనుమంతునివంటి బంటు లేడు. 'హనుమే రామం-రామే హనుమం!' శ్రీరాముని పట్టాభిషేక సందర్భమున మారుతి సృష్టించియిచ్చిన 'కానుక' ఎట్టిదో రక్తిముక్తి కూర్చునట్లు ఈచిన్ని నాటిక రూపించును.

౮ వివేకానంద సందేశము :

యావత్తు భౌతిక ప్రపంచమును గజగజలాడించి ఉద్రూతలూగించిన ఆ వంగదేశపు యతీశ్వరుని సుభాషితములు ఎవరికి శిరోధార్యములు కావు?

౯ ఛాయ-ఇతర నాటికలు :

పెంపుడుపిల్ల 'ఛాయ' చిత్రకథ అత్యంత హృదయంగమము. 'ఘాత' నాటికలోని సంభాషణలు షేక్స్పియరు మహాకవి రచించిన Macbeth లోని సంభాషణలతో సరితూగుచున్నవి. 'రిక్షావాలా' కథ బలే వినోదమును, విజ్ఞానమును కూర్చును. 'నేనే రాజునైతే' అనునది ఉత్తేజకరమగు ఆల్ఫ్రెడ్ రాజు ఉదంతము.

౧౦ గ్రిసెల్డా

'నడుమంత్రపు సిరి'ని ఒల్లక, 'తామరాకుమీది నీటిబొట్టున'కువలె ఆదర్శ జీవితము గడపిన వేదాంతిబాలిక అద్భుత కథనము.

౧౧ ఆనంద సామ్రాజ్యము :

శ్రీరామతీర్థస్వామి ఉపన్యాసము. ఆత్మజిజ్ఞాసను రేకెత్తించును.

౧౨ దివ్యవాణి :

ఒక హరిజనుని దయనీయ చరితము. అతని త్యాగశీలము కఠోర చిత్తవృత్తి గల పూజారి హృదయమును ఎట్లు నవనీతముగ మార్చినదో చదివి తీరవలెను. ఈనాడు ప్రతివారి దృష్టిని అవశ్యమూ ఆకర్షింపదగిన బ్రహ్మాండ సమస్య మనోజ్ఞమైన ఈ కథలో చర్చింపబడినది.

JAYA NIKETHAN :: PUBLISHERS :: MADRAS 7.

Printed at The Liberty Press, Madras—Q.H. M.S. 499
for Jaya Nikethan Publishers QH. No. WG/52-3M-7-'46—3000 C.

: : ఇటీవల ప్రకటితమయిన 'జయా ప్రసూనములు' : :

## ప్ర వా సి (టాల్స్టాయి కథ)

మాతృపూజాధ్యాన తత్పరుడైన దేశభక్తుని విచిత్ర కథనము. అతడు నెరపిన సాహస కృత్యములు ఒడలు పులకింపజేయును. రచన : శ్రీపతి నరసింహరావు, బి. ఏ. (Approved for class use)

'శ్రీ ఆంధ్ర శేషగిరిరావు బి.ఏ., గారి రచనలు :'

## కే యూ ర బా హు చ రి త్ర

శిల్పము మెరయ మంచనమహాకవి రచించిన కేయూరబాహు చరిత్ర అను పద్యకావ్యమునకు తేటతెనుగు వచనము. పంచతంత్రములోవలె ఇందు నడుమనడుమ చక్కని నీతికథలు పెక్కులు గలవు. (Approved by the T.B.C.)

## ఆం ధ్ర ర మ ణీ మ ణు లు – ౧ భా.

కాకతీయాంధ్ర సామ్రాజ్యమేలిన రుద్రమ్మ, ఆమె సోదరి ధరణికోట ప్రభ్వి గణపమ్మ, నాయకురాలను బిరుదుగాంచిన పలనాటి నాగమ్మ, మగని యుద్ధభూమికి పంపిన మాంచాల, జోహారొనర్చిన రాగమ్మ, ఆమె మనుమని రక్షించిన మహాలక్ష్మమ్మ, పతివ్రతా తిలకమగు సీతమ్మ, బొబ్బిలి రాణి మల్లమ్మ, నిజప్రాణముల ఖడ్గమున కెరచేసిన రమణమ్మ అను తొమ్మండుగురి తెనుగు తెఱవల చరిత్రలు.

## ఆం ధ్ర ర మ ణీ మ ణు లు – ౨ భా.

ఖడ్గతిక్కనకు వీరస్వర్గ మిప్పించిన వీరపత్ని చానమ్మ, తంజావూరి తెనుగురాణి రాజగోపాలమ్మ, ఈమె మనుమని రక్షించిన దాది, మధురరాజ్యమేలిన మంగమ్మ, మీనాక్షి, ముత్తమ్మ, శిశుసహితముగ బలిపోయిన సంగమ్మ అను ఏడుగురు తెలుగు ఎలనాగల పవిత్ర చరిత్రలు.

## ఆం ధ్ర రా జ భ క్తు లు

రాజభక్తి యనునది దేశభక్తికి పర్యాయపదముగా రాణించుచుండిన ఆంధ్రదేశపు స్వతంత్రయుగ చరిత్రలలో రాణించు రాజభక్తి శిఖామణులగు విశ్వనాథనాయడు, యాచమనాయడు, అబ్దుర్ రజాక్ లారీ, కరి బసవస్వామి, తిక్కనమంత్రి, మహాలక్ష్మమ్మ, పాపారాయడు, హనుమప్ప నాయడు అను ఎనమండుగురి చరిత్రలను కీర్తించు గ్రంథరాజము.

# జయాప్రసూనములు: నియమావళి

లోగడ మెలుపాక - వ్యాసకుటీరమునుండి వెలువడుచుండిన 'ఆంధ్రసేవా ప్రసూనముల'ను చేర్చి ఇపుడీ 'జయా ప్రచురముల'ను క్రొంగ్రొత్త తీరులలో వెలయించుచున్నాము. సొంపులు గుల్కు అనేక ఆధునిక రచనలు 'జయానికేతనము'నుండి క్రమప్రచురణ నందబోవుచున్నవి. యథోచితమగు మా సేవను గుర్తించి ఆంధ్రమహాశయులీసంస్థకు పోషణప్రోత్సాహము లొసగినచో అచిరకాలముననె దివ్యరత్నము లనంతములుగ తెలుగువారి కరకమలముల నలంకరించగలవని మనవి చేయుచున్నాము.

క్రౌన్ 1/8 సైజున సుమారు నూరు పుటలు గల 'జయాప్రసూనములు' పన్నెండేసి ఒక్కొక్క సెట్టు చొప్పున వెలువడును.

## ప్రతిష్ఠాపకులు :

ఒక గ్రంథమును ముద్రించి అనుగ్రహించువారు గ్రంథమాలిక ప్రతిష్ఠాపకులు. వారి ధన సాహాయ్యముతో ముద్రితమగు గ్రంథమున వారి ఛాయాచిత్రము ప్రకటితమగును. వారి నామాక్షరములు ప్రకటించుచు, నికేతనమునుండి వెలువడు సమస్త ప్రచురములనుక్రమశః సమర్పించుకొనుచుందుము.

## పోషకవర్గము :

[పారితోషికముల వివరణ]

| | |
|---|---|
| మహారాజపోషకులు | ...రు. 116 లు |
| రాజపోషకులు | ...రు. 58 లు |
| పోషకులు | ...రు. 25 లు |

పోషక, రాజపోషక, మహారాజపోషక మహాశయుల నామాక్షరములు ఆయా సెట్టులలోని ప్రసూనముల నలరించగలవు; ఎడనెడ 'నికేతనము'నుండి వెలువడు అనుబంధములు, ప్రత్యేక ప్రచురణలు మున్నగునవి ఈ యెల్లరకు ఉచితముగ నందజేయుచుందుము.

## అభిమానులు :

ఒకేసారి రు. 10/-లు విరాళము నొసగువారు 'నికేతనఅభిమానులు.' వీరికి 12 ప్రసూనముల మాలికను (తపాలు వ్యయము నేమే భరించి) చేరుపగలము. వీరు 'ప్రసూనముల'లోని ఇష్టమువచ్చిన ఏపన్నెండిటినయిన ఎన్నుకొని చేకొనవచ్చును.

జయా నికేతనము :
మదరాసు, 1-1-47

సంపాదకుడు
ముద్దా విశ్వనాథము

## :: జయా నికేతన పోషకవర్గము ::

### ప్రతిష్ఠాపకులు :

౧. శ్రీ కనుపూరి వెంకటరమణమూర్తిగారు, మొఖాసాదార్లు, వరహాపుర అగ్రహారం (విశాఖపట్నం జిల్లా)

### మహారాజపోషకులు :

౧. జుబ్దాతల్ అక్రన్ శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహదూర్, ఎం. ఎల్. ఎ. వారు, చల్లపల్లి సంస్థానాధీశులు.

౨. శ్రీ చెరుకూరి రామనాథ బాబుగారు, ల్యాండ్‌లార్డు, చల్లపల్లి.

3. శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారు, ప్రొప్రయిటర్: వేంకటరామా అండ్ కో., ఏలూరు (పశ్చిమగోదావరిజిల్లా.)

### రాజపోషకులు :

౧. శ్రీ రావుబహదూర్ జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారు, M.L.C., కారంచేడు (గుంటూరు జిల్లా)

౨. డాక్టర్. కె. రామజోగి నాయుడుగారు, M.H.U. A.H., & A.M.P., చూచికొండ (విశాఖపట్టణము జిల్లా)

3. శ్రీ డి. ఎన్. మూర్తిగారు, మేనేజరు: బ్రిటిష్ ఇండియా టుబాకో కంపెనీ, గుంటూరు.

౪. శ్రీ బి. నాగిరెడ్డిగారు, ప్రొప్రయిటరు: బి. ఎన్. కె. ప్రెస్, 37, ఆచారప్పన్ వీధి, జి. టి. మద్రాసు.

౫. శ్రీ వి. వి. రమణయ్యగారు, ఏజంట్: ఆంధ్రా బ్యాంకు లిమిటెడ్, ఎస్ప్లనేడ్, మదరాసు.

## పోషకులు :

౧. శ్రీ చెక్కా అప్పారావుగారు, జనరల్ మర్చంటు, తాడేపల్లిగూడెం.

౨. శ్రీ పోడూరి మృత్యుంజయరావు పంతులుగారు, ల్యాండ్ లార్డ్, తాడేపల్లిగూడెం. (ప॥ గోదావరిజిల్లా)

3. శ్రీ పి. శర్మగారు, ప్రొప్రయిటర్; శర్మాకంపెనీ & ఆర్గనైజర్ : న్యూ ఇండియా అస్యూరెన్సు కంపెనీ, తాడేపల్లిగూడెం.

౪. శ్రీ మైసూర్ సుందరరావుగారు, మర్చంట్ అండు కమిషన్ ఏజంట్, తాడేపల్లిగూడెం.

౫. శ్రీ పి. సీతారామయ్యగారు, ఎడిటర్ & ప్రొప్రయిటర్ : 'రూపవాణి' 16, సుంకురామశెట్టి వీధి, జి. టి., మదరాసు.

## అభిమానులు :

౧. శ్రీ మోటూరి సత్యనారాయణ చౌదరిగారు, బి. ఏ., వెల్లటూరు (via) భట్టిప్రోలు (గుంటూరు జిల్లా)

౨. శ్రీ S. V. L. నరసింహంగారు, బి.ఏ.,బి.ఎల్., వకీలు, బ్రాడీపేట, గుంటూరు.

3. శ్రీ గోరింట వెంకటశివరామ రాజుగారు, ల్యాండ్ లార్డు అండు జర్నలిస్టు, అలంపురం (పశ్చిమగోదావరి జిల్లా)

౪. శ్రీ కె. నరసారెడ్డిగారు S/O కొవ్వూరి గంగిరెడ్డిగారు, పెంటపాడు (పశ్చిమ గోదావరిజిల్లా)

౫. శ్రీ నున్న రామచంద్రరావుగారు, మర్చెంటు, తాడేపల్లిగూడెం.

